

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**

# సాంప్రదాయిక వ్యాస మాలిక- 21

13-08-2023



మలయప్పస్వామి, తిరుమల




**'పండితరత్న'**
**డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పాగ శింగరాచార్యులు**

**సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు**

# విషయసూచిక

# 1. మనం ఏం చేస్తే భగవానుడు తృప్తిపడతాడు?

మనం ఏ విధంగా చేస్తే, ఏ విధంగా ప్రవర్తిస్తే భగవంతుడు తృప్తిపడతాడు? ఏమి చేస్తే భగవానుడు తృప్తిని పొందుతాడు? అంతేకాక, నేను ఒక పనిని చేసినందు వల్ల భగవానుడు తృప్తి పడ్డాడు– అని ఏ విధంగా నేను తెలుసుకోవడం? అనేది ఒక ప్రశ్న. ఈ ప్రశ్నలో రెండు భాగాలు ఉన్నాయి. దేనివల్ల భగవంతుడు తృప్తి పడతాడు? అనేది ఒక భాగం. అతడు తృప్తి పడినట్లు మనం ఏ విధంగా తెలుసుకోవడం? అనేది ఇంకొక భాగం.

ఇప్పుడు, మొదటి ప్రశ్నకు సమాధానంగా ఒక పౌరాణిక శ్లోకాన్ని గమనిద్దాం. "వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణు రారాధ్యతే పంథా, నాన్యః తత్తోషకారకః" అనేది ఆ శ్లోకం. భగవంతుని ఆనందింప చేయడంలో, తృప్తి కలిగించడంలో ఈ మార్గం తప్ప వేరే ఒక మార్గం ఏదీ లేదు. అది ఏమంటే, ఆయా వ్యక్తులకు విధింపబడిన, వర్ణానికి, ఆశ్రమానికి తగినట్లుగా విధింపబడి కర్మలను ఆచరిస్తూ ఉండేవాడే పరమాత్మను ఆరాధించినవాడు అవుతాడు. వేరొక రీతిలో అతడు ఆ పరమాత్మను ఆనందింప చేయలేడు– అనేది ఈ శ్లోకంలోని తాత్పర్యం. తల్లిదండ్రులను పూజించడం, ఆయా దేవతలను ఆరాధించడం, మనలను శారీరకంగా, మానసికంగా పవిత్రంగా చేసుకోవడం కోసం అవలంబించవలసిన ఆచారాలు, పద్ధతులు –అనే వీటిని ఆచరించడం అనేది ప్రతి వ్యక్తి అనుసరించాలి. ఇదే భగవంతునకు మనం చేసే ముఖ్యమైన పూజ. మనం ఆచరించవలసిన సనాతనమైన ఆచారాలు, వ్యవహారాలు అనే వీటిని అన్నిటిని మనం అనుసరించినట్లయితే, అదే భగవంతుని తృప్తిని కలిగిస్తుంది. బ్రహ్మచారి అయితే, అతని స్థితికి తగినట్లు వర్తించాలి. గృహస్తుడైతే దానికి తగినట్లు వర్తించాలి. సన్యాసి అయితే ఆ ఆశ్రమానికి తగినట్లు నడుచుకోవాలి. ఈ విధంగా ప్రతి వ్యక్తి తనకు విధింపబడిన నియమాలను అనుసరించి వర్తించాలి. ఇదే భగవంతుని సంతోష పెట్టే క్రమం. ఇందువల్లనే భగవంతుడు సంతోషపడతాడు– అనేది ఇక్కడ సమాధానం పై పురాణ శ్లోకం ఈ సమాధానాన్ని తెలియజేస్తున్నది.

భగవద్గీతలో భగవానుడు ఎవరెవరు, ఏ విధంగా ఉండాలో ఆ ప్రకారాన్ని అంతటినీ తెలియజేశాడు. మనం సత్వగుణంతో ఉండాలి, . రజోగుణతమోగుణాలను దూరం చేసుకోవాలి, సాత్వికమైన ఆహారాన్ని భుజించాలి అని మొదలైన, మనం అనుసరించవలసిన నియమాలను పరమాత్మ ఉపదేశించాడు. వాటిని మనం అనుసరించాలి. ఆ విధంగా చేస్తే భగవానుడు తృప్తి పడతాడు.

సరే, బాగున్నది. ఇప్పుడు మనకు ఒక ప్రశ్నకు సమాధానం లభించింది. పైన అడిగిన మొదటి ప్రశ్నకు నేరుగా ఉండే సమాధానం లభించింది. కానీ, ఇప్పుడు దీనిని అనుసరించి ఇంకొక ప్రశ్న కలుగుతుంది. ప్రస్తుత కాలంలో ఈ నియమాలను మనం ఏ విధంగా అనుసరించడం? శాస్త్రాలలో చెప్పినా నియమాలను అన్నిటిని మనం అనుసరించడానికి ఆచరించడానికి ఇపుడు సాధ్యం కాదు కదా! అనే ప్రశ్న వెంటనే కలుగుతుంది. ఈ ప్రశ్నకను ముందుగానే దూరదృష్టిని కల, ఉదారులైన మన పూర్వాచార్యులు ఆలోచించి, మన శక్తి సామర్థ్యాలకు అవకాశాలకు తగినట్లుగా, శక్తివంచన లేకుండా నియమాలను ఆచరిస్తే, చాలు. అప్పుడు భగవానుడు తప్పక తృప్తి పడతాడు –అనే ఒక చక్కని, ఆచరణ యోగ్యమైన సమాధానాన్ని చెప్పారు. అందువల్ల యధాశక్తి మన కర్తవ్యాలను ఆచరించడం అనే పనిని తప్పక చేయాలి. అది ఏ కాలంలో అయినా ఆచరణ సాధ్యమే కదా.

"అది కూడా సాధ్యం కాదు" అని అన్నారనుకోండి. దానికి ఏ విధంగా సమాధానం చెప్పడం? ఒకడు ఒక పరీక్షను రాశాడనుకోండి. ఆ పరీక్షలో అతడు వందకు 35 మార్కులను తెచ్చుకుంటే ఉత్తీర్ణుడు అయినట్లు అవుతాడు. 90 మార్కులను తెచ్చుకుంటే డిస్టింక్షన్, 70 మార్కులను తెచ్చుకుంటే ప్రథమ శ్రేణి. అందువల్ల 90 మార్కులను తెచ్చుకో – అని మొదట చెప్పవచ్చు అది సాధ్యం కాకపోతే, 70 మార్కులను తెచ్చుకో. అది సాధ్యం కాకపోతే కనీసం 35 మార్కులను తెచ్చుకో. – అని చెబుతాము. "ఆ మార్కులను కూడా తెచ్చుకోలేను, నేను ఏ విధంగా పరీక్షలో ఉత్తీర్ణుడను కాగలను? " అని అడిగితే, దానికి మనమేమి బదులు చెప్పగలం! . ఇటువంటి ప్రశ్నను పాఠశాలలలో ఎవరు ఏ విద్యార్థి అడగలేదు. దానికి సమాధానం చెప్పే అవకాశం కూడా లేదు.

ఇదే ప్రశ్న భగవంతుని దగ్గర అడిగాము అనుకోండి. భగవంతుడు పాఠశాలలో రెండు ఒకటేనా! ఆ భగవంతుడు తలిస్తే, 10 మార్కులు వచ్చినా ఉత్తీర్ణుడయ్యాడని అతడు చెప్పవచ్చు. ఈ విధమైన భావనతో అడిగినట్లయితే, అప్పుడు పై ప్రశ్న ప్రశంసనీయమే. ఇటువంటి నమ్మకం కలిగినట్లయితే, "భగవంతుడు తన కరుణతో అనుగ్రహించవచ్చు కదా" అనే నిశ్చయం కలిగినట్లయితే, అప్పుడు, ఆ భగవంతుడు ఏమేమి చేయమని విధించాడో, వాటిని కనీసం చేయగలిగిన శక్తి లభిస్తుంది. సందేహం లేదు. ఆ విధమైన నమ్మిక కూడా లేకుండా, ఏ కర్తవ్యాన్ని చేయకుండా, ఏ విధంగా బాగుపడడం? అని అంటే, అది సాధ్యమయ్యే పని కాదు. ఏ విద్యాలయంలోనూ ఉపాధ్యాయుడు ఒక్క మార్కు కూడా

రానివానికి 35 మార్కులను ఇచ్చి ఉత్తీర్ణుడు చేయలేడు. చేయడు కూడా. అవసరమైతే, ఏదో నాలుగైదు మార్కులను కలిపి ఉత్తీర్ణుని చేయవచ్చు, అంతే.

అందువల్ల, భగవంతుడు విధించిన నియమాలను కనీసం అనుసరించగలిగిన శక్తిని ప్రసాదించి అనుగ్రహిస్తాడు, అంతే తప్ప, ఏ నియమాలను అనుసరించకుండా, కర్తవ్యాలను చేయకుండా భగవానుని అనుగ్రహాన్ని పొందాలని భావించడం సరియైనది కాదు. “నన్ను ఆ నియమాలను అనుసరించి ఆచరణను చేయగలిగేటట్లు భగవంతుడు అనుగ్రహిస్తాడు” అని భావించాలి. ఇది ఒక విషయం.

ఇంకొక విషయం ఏమిటంటే, భగవంతుడు ఆనందించాడు– అని ఏ విధంగా తెలుసుకోవడం? అనేది. ఈ ప్రశ్నకు ఏమని సమాధానం చెప్పగలం? తనకు ఒక సంతానం కలిగినప్పుడు, తల్లి సంతోషించిందా, లేదా? అని ఏ విధంగా మనం చెప్పగలం? తన బిడ్డ తప్పక అడుగులు పెట్టడాన్ని చూసినప్పుడు తల్లి ఆనందించిందా లేదా? అని అడిగితే, ఏమని బదులు చెప్పగలం? తనను మొట్టమొదటగా “అమ్మా” అని బిడ్డ పిలిచినప్పుడు, ఆ తల్లి ఆనందించిందా లేదా? ? అని ఏ విధంగా చెప్పగలం? ఈ ప్రశ్నను ఇంతవరకు ఎవరు అడగలేదు, అడిగినా చెప్పగలిగిన సమాధానం లేదు, సమాధానం చెప్ప వలసిన ఆవశ్యకత కూడా లేదు. ఎందుకంటే, తల్లికి, బిడ్డకు మధ్య అంతటి దగ్గర, గాఢమైన సంబంధం ఉన్నదికదా. అందువల్ల, ఒకడు తాను కనీసం ఉండదగిన ఆచారించదగిన పరిమితిలో ప్రవర్తించినప్పుడు ఆచరించగలిగినప్పుడు, భగవంతుడు తప్పక తృప్తి పడతాడు. ఆ భగవానుడు మన చేసిన పనిలో ఉండే దోషాలను గమనించే దృష్టిని కలిగినవాడు కాదు. మన కార్యాలలో దోషాలు ఉన్నప్పటికీ, వాటిని గమనించడు.

అయినా కూడా, మనకు సందేహం ఉందని అనుకోండి. ఆ సందేహం ఏమంటే, భగవంతునిపై కాదు మన పైన సందేహం, మనం చేసే కార్యాలు సరిగా ఉన్నాయా? లేదా? అనేది సందేహం. మన విషయంలోనే ఆ సందేహం ఉందని అనుకోండి. దీనిని తీర్చుకోవడం ఏ విధంగా? అని అంటే, మనమే పరీక్ష రాసి, మనమే మార్కులను వేసుకోవడం సాధ్యం కాదు కదా. తగదుకదా. ఏ విద్యాలయాల్లో చదివి పరీక్ష రాసినప్పటికీ, ఆ పరీక్షలో సమాధానం సరిగా వ్రాశామా? లేదా? అని నిర్ణయించే పరీక్షాధికారి ఒకరు ఉంటారు. ఆ అధికారి నిర్ణయించినప్పుడే, సరిగా ఉన్నదని చెప్పినప్పుడే, విద్యార్థి ఉత్తీర్ణుడు కాగలడు. ఒక విద్యార్థి రాసిన పరీక్ష సరిగా ఉందా? లేదా? అని నిర్ణయించడం కోసమే కదా అధికారులు ఉన్నారు. ప్రకృతంలో అధికారులు ఎవరంటే సత్సంగం, . ఆచార్య సమాశ్రయణమే. మనం సరిగా ఉన్నామా? లేదా? అనే విషయాన్ని, మనం ఆచరించే పనులతో భగవంతుడు తృప్తి

పడుతున్నాడా? లేదా? అనే విషయాన్ని సత్సంగంలోని భాగవతులు మనకు తెలియజేస్తారు. వారు సాత్వికులు కనుక తప్పుగా చెప్పరు. పక్షపాతంతో పలుకరు. ఒకవేళ, మన ఆచరణ సరిగా లేకపోతే, మనలను సంస్కరిస్తారు. ఆ విధంగానే, ఒక సదాచార్యుని మనం ఆశ్రయించినట్లయితే, ఆ ఆచార్యులు కూడా మనలను చక్కని క్రమంలో పెడతారు. మన తప్పులను సరిదిద్దుతారు. ఎక్కడ మనం తప్పు చేస్తున్నామో, ఏ విషయంలో మనలను బాగు చేయాలో తెలిసినవారు కనుక, వారు సంస్కరించగలరు. మనకు కలిగే సందేహాలను అన్నిటినీ తీరుస్తారు.

ఇప్పుడు, మళ్లీ ఇంకొక సందేహం కలుగవచ్చు. సత్సంగం వల్ల మన సందేహాలు తీరుతాయి, మన ప్రవర్తనను మనం బాగు చేసుకోవచ్చు, సరే, ఇప్పటి కాలాన్ని బట్టి సత్సంగాన్ని పొందడం అనేది ఏ విధంగా సాధ్యం అవుతుంది? అనేది ప్రశ్న. ఈనాడు కూడా సత్సంగాన్ని పొందడంలో అడ్డు ఏమీ లేదు. వీలైతే సాక్షాత్తుగానే వారితో సంబంధాన్ని పెట్టుకోవచ్చు. లేదంటే, ఆధునిక కాలంలో వచ్చిన సౌకర్యాలను అనుసరించి ఆన్లైన్ ద్వారా కూడా సత్సంగాన్ని పొందవచ్చు. దీనిని ఇప్పుడు సర్వత్రా మనం చూస్తూనే ఉన్నాము. కాకపోతే, ఇక్కడ కావలసినది ఏమంటే, పెద్దలు చెప్పిన దానిని వినే మనస్సు, ఓర్పు మనకు ఉండాలి. అవి ఉంటే, సత్సంగం తప్పక లభిస్తుంది. అందువల్ల సాధు సమాగమం, సత్సంగం, సదాచార్యుని ఆశ్రయించడం అనే ఇవి అన్నీ, భగవంతుడు మన ప్రవర్తనతో ఆనందిస్తున్నాడా? లేదా? అని తెలుసుకోవడానికి ఉపాయాలు, మార్గాలు. వారు మనకు భక్తిని పెంపొందింప చేస్తార. మనం తప్పు చేసినప్పుడు ఆ తప్పులను సరిదిద్దుతారు. సరిగా ప్రవర్తిస్తే మనలను అభినందిస్తారు కూడా. అందుచేత, భగవాను మనతో తృప్తి పడ్డాడా? ఆనందించాడా? లేదా? అనే విషయాన్ని తెలుసుకోవడానికి సత్పురుషులతో సమాగమం, వారిని భక్తితో సేవించడం అనేవి ఉపయోగపడతాయి. అంతే తప్ప, నేను పరీక్షనే వ్రాయను, పరీక్ష వద్దనే వద్దు, కానీ నేను ఉత్తీర్ణుడను కావాలి– అని భావించకూడదు. అందువల్ల, సత్సంగం ఎందుకు? సదాచార్యుని ఆశ్రయించడం ఎందుకు? అనే ప్రశ్నిస్తే, ఆ విధంగానే, ఇక, పాఠశాల ఎందుకు? ఉపాధ్యాయుడు ఎందుకు? పరీక్ష ఎందుకు? పరీక్షాధికారి ఎందుకు? మార్కులు తెచ్చుకోవడం ఎందుకు? అని ధారాళంగా ప్రశ్నించవచ్చు. కాని, మనం ఆ ప్రశ్నలను వేటిని అడగడం లేదు కదా. అందువల్ల సత్సంగాన్ని గూర్చి, సదాచార్యుని ఆశ్రయించడాన్ని గూర్చి మనం ప్రశ్నించనక్కరలేదు. సత్సంగాన్ని పొంది, సదాచార్యుని ఆశ్రయించి, మనలను సంస్కరింప చేసికొని, సత్ప్రవర్తనతో భగవంతుని తృప్తిని పొందుదాం, ఆ స్వామికి తృప్తిని కలిగిద్దాం. స్వస్తి.

★★★★★

# 2. పిల్లలకు చిన్న వయస్సులోనే స్వధర్మబోధన

(శ్రీమాన్ వేలుక్కుడి కృష్ణన్ స్వామి తమిళోపన్యాసం ఆధారంగా)

ప్రస్తుత కాలంలో పాఠశాలలో చేరిన నాటినుండి చరిత్ర, భూగోళ శాస్త్రం, విజ్ఞాన శాస్త్రం, గణితం, ఆంగ్లం, తెలుగు, హిందీ మొదలైన పాఠ్యభాగాలను పిల్లలు తప్పకుండా చదువుతున్నారు. ఈ విషయాలను చదువనివారు ఎవరు లేరని చెప్పవచ్చు. కానీ, అదే సమయంలో, ఏ పాఠశాలలో అయినా, ఏ దశలో అయినా, ఎక్కడైనా, స్వధర్మం అనే పాఠ్యభాగాన్ని వారు చదువుతున్నారా? మరి, అది ఏ వయస్సు నుండి చదువుకోవాలి? చిన్న వయస్సు నుండి నేర్చుకుంటే కదా అది ఒంటపడుతుంది. దానినిఆచరించాలని తోస్తుంది, గౌరవించాలని తోస్తుంది.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో స్వధర్మాన్ని విధించాడు. దానిని ఆశతో ఆచరించమని చెప్పారు స్వధర్మానికి కల గొప్పతనాన్ని వివరించాడు కూడా. " శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనేది గీతలోని అందమైన శ్లోకం. మనకు అని విధింపబడిన ధర్మాలు – యుగధర్మం, వ్యక్తి ధర్మం, వర్ణధర్మం, ఆశ్రమ ధర్మం, స్త్రీధర్మం, పురుష ధర్మం, ఆపద్ధర్మం– అని ఈ విధంగా వేరు వేరు విధాలుగా అనేక విధాలుగా ఉన్నాయి కదా. వాటిని ఏ విధంగా అర్థం చేసుకోవడం. మనకు భ్రమ ప్రమాదాలు కలుగవచ్చు కదా! అని భావించర నక్కరలేదు. ఒకటవ క్లాస్ నుండి, లేక ఎల్కేజీ నుండి 12 వ క్లాసు వరకు, అంటే, కాలేజి చదువుకు వచ్చేవరకు, ఇంచుమించుగా 12 నుండి 14 సంవత్సరాల కాలం మన పిల్లలు పాఠశాలలో చదువుతున్నారు. ప్రతి దినం ఎంతసేపు రోజు పాఠశాలలో చదువుతున్నారు? ఆరు గంటలకు తక్కువ కాకుండా కదా పాఠశాలలో చదువుతున్నారు. ఈ విధంగా 14 సంవత్సరాల పాటు, ప్రతి దినం ఆరు గంటల సమయం పాఠశాలలో వారు చదివేటప్పుడు ఈ సమయంలో ఇంతటి దీర్ఘమైన సమయంలో స్వధర్మం అంటే ఏమిటో తెలుసుకోవడానికి వాస్తవానికి ఒక్క సంవత్సరం పాటు చాలు. ప్రతి దినం ఒకటి రెండు గంటలు దానికోసం వినియోగిస్తే చాలు. దానిని గూర్చిన అవగాహనను సంపాదించవచ్చు. కాకపోతే, ఏమి అవసరమంటే, అది కావాలి, మనం నేర్చుకోవాలి –అనే ఉద్దేశ్యమే ఉండాలి.

ఇటువంటి స్వధర్మానికి గల ప్రాధాన్యాన్ని ఉద్దేశించి శ్రీకృష్ణుడు భగవద్గీతలో. "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అని అంటూ, తనకు చెందిన ధర్మాన్ని అనుసరించడం అనేది

చాలా ఆవశ్యకం అని చెప్పాడు, "స్వధర్మజ్ఞాన వైరాగ్య జ్ఞానభక్త్యైక గోచరః" అని శ్రీయామున మునులుకూడా గీతార్థ సంగ్రహంలో అన్నారు. స్వధర్మాచరణం వల్లనే భగవంతుని సరిగా తెలుసుకోవడానికి వీలవుతుంది. స్వధర్మం అనేది బాగా వయస్సు వచ్చిన తరువాత, ఎవరి దగ్గరో, నాలుగైదు ప్రశ్నలను అడిగి, ధర్మాన్ని తెలుసుకోవాలని అనుకోవడం సరికాదు. ఆ విధంగా తెలుసుకోవడానికి ప్రయత్నించడం శ్రమ సాధ్యమైన పని. దానిని తెలుసుకోదగిన వయస్సులో, అంటే, చిన్న వయస్సు నుండి తెలుసుకున్నట్లయితే తెలుసుకోవడం సులభం అవుతుంది.

అందువల్ల, తల్లిదండ్రులు అందరూ తమ సంతానాన్ని పెంచేటప్పుడు, వారి చిన్నతనం నుండి, ప్రతి దినం, ఎంతో కొంత సమయం స్వధర్మాన్ని తెలియజేయడం కోసం వినియోగించినట్లయితే, మంచిది. మరీ చిన్నతనంలో చెప్పమని ఉద్దేశ్యం కాదు. పది సంవత్సరాల వయసు పూర్తి అయిన తరువాత, మన పిల్లలకు స్వధర్మాన్ని గూర్చిన బోధన చేయవచ్చు. వారి మనస్సు ఆ దశలో వికసించడం ప్రారంభిస్తుంది. ఆ దశలో ఏర్పడిన సంస్కారం అనేది బలంగా, జీవితాంతం ఉండే అవకాశం ఉన్నది. పది సంవత్సరాల వయసుకు ముందు, మన సంస్కృతికి ధర్మానికి సంబంధించిన కథలను, శ్లోకాలను, పద్యాలను, పాశురాలను నేర్పించవచ్చు. పది సంవత్సరాలు పైబడిన తరువాత, కనీసం ఒకటి రెండు సంవత్సరాల కాలం, ప్రతి దినం ఒకటి రెండు గంటల కాలాన్ని వినియోగించి, లేదంటే, వారాంతంలో గాని, ఒకటి రెండు గంటలు వినియోగించి, స్వధర్మబోధనను తల్లిదండ్రులు చేయడం మంచిది. ఆ పని వారికి చక్కని సంస్కారాన్ని కలిగిస్తుంది.

ఇది మన కర్తవ్యం. శ్రీకృష్ణ పరమాత్మ గీతలో " నియతను కురు కర్మ త్వమ్" అని, నీకు విధింపబడిన కర్మలను నీవు చేసి తీరాలి– అని అంటూ శ మనం మన కర్తవ్యాలను తప్పక చేయాలని ఆశపడ్డాడు. " స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" – నేను చేయమని చెప్పిన కర్మలలో కొంచమైనా నీవు చేసినట్లయితే, అది నిన్ను పెద్ద భయంనుండి కూడా కాపాడుతుంది– అని స్వధర్మ ప్రభావాన్ని మహిమను తెలిపాడు.

మనం, ఒక వైపు శ్రీకృష్ణుని విషయంలో చాలా భక్తి ఉందని అంటాము. కానీ, ఆ శ్రీకృష్ణుడు మాటిమాటికి "స్వధర్మం స్వధర్మం" అని మన ధర్మాన్ని ఆచరించమని మనకు చెప్పాడుకదా. కానీ, దానిని మనం నిర్వర్తిస్తున్నట్లు కనబడడం లేదు. సధర్మ బోధన అనేది విద్యాలయాలో ప్రభుత్వం ఏర్పరచకపోయినా, మనం, మన ఇంటి దగ్గర అయినా, ఆ స్వధర్మాన్ని బోధించే ప్రయత్నం చేయాలి. మన పిల్లలకు ఒక వయస్సు వచ్చిన తరువాత,

“మన కూతురు ఈ విధంగా ప్రవర్తిస్తున్నదే! మన కుమారుడు ఈ విధంగా మాట్లాడుతున్నాడే! మన సంప్రదాయంఆచార వ్యవహారాలకు విరుద్ధంగా ఉన్నారే! వాటిలో నమ్మకం లేనట్లు మాట్లాడుతున్నారే!” అనే బాధ పడవలసిన ఆవశ్యకత ఉండదు. ఆ విధంగా వారు మాట్లాడడానికి కారణం, వారికి దానిని గూర్చిన అవగాహన గాని, అలవాటు గాని లేకపోవడమే కదా. ఆ విధంగా కాకుండా, చిన్నతనం నుండి సద్ధర్మంతో, మన సంస్కృతితో సంబంధాన్ని కలిగినవారై, అవగాహన కలిగినవారై ఉన్నట్లయితే, వారు వాటికి విరుద్ధంగా మాట్లాడి, ప్రవర్తించే అవకాశం తక్కువగా ఉంటుంది. ఒక విషయంలో అవగాహన లేనప్పుడు, దానిని గూర్చి సహజంగా ఎన్నో సందేహాలు, ప్రశ్నలు కలుగుతాయి. వయసు వచ్చిన తరువాత, ఒకవేళ, వారు అడిగిన ప్రశ్నలకు మనం మనకు తెలిసిన సమాధానాలను చెప్పినా, వారు తృప్తి పడకపోవచ్చు. ఎందుకంటే, వారికి అంతవరకు స్వధర్మాన్ని వచ్చిన గూర్చిన అవగాహన ఏమీ లేదు కదా. ఇంతకాలం నేను ఒక రీతిలో ఉన్నాను కదా! ఇప్పుడు దానికి విరుద్ధంగా భావించడం గాని, ప్రయత్నించడం వర్తించడం గాని ఎందుకు? అనే అభిప్రాయమే వారికి కలుగుతుంది. అందువల్లనే వారు మనం చెప్పిన మాటలకు అంగీకరించరు.

ఇందువల్ల స్వధర్మ బోధన కోసం ఒక ప్రణాళిక ఆవశ్యకం. దీనిని గూర్చి ఇప్పటికే కొంతమంది పెద్దలు, మహనీయులు ప్రయత్నం చేశారు కూడా. వస్వధర్మాన్ని తెలియజేసే పాఠ్యపుస్తకాలు కూడా ఉన్నాయి. వాటిని కనీసం మన ఇంటి దగ్గర అయినా, మన పిల్లలకు బోధించి, స్వధర్మాన్ని గూర్చిన అవగాహనను వారికి కలిగిస్తే, మనకు వారు విపరీతంగా మాట్లాడటం, కానివర్తించడం గాని చేసే అవకాశం ఉండదు. దీనిని గూర్చి పెద్దలు మహనీయులు కూడా ఆలోచించాలి. పిల్లల తల్లిదండ్రులు కూడా గమనించాలి. ఈ విషయంలో అందరూ కలిసి ప్రయత్నం చేసినట్లయితే, చిన్నపిల్లలకు, వారు చదివే వయస్సులోనే స్వధర్మాన్ని గూర్చిన బోధనను చేసే అవకాశం ఉంటుంది. అపుడు, స్వధర్మం అంటే ఏమిటో వారికి అవగాహన ఏర్పడే అవకాశం కలుగుతుంది. స్వస్తి.

★★★★★

# 3. విభీషణశరణాగతిలో షడంగాల పూర్తి

శరణాగతి ఫలించాలంటే, అది 6 అంగాలను కూడినదై ఉండాలని శాస్త్రాలు తెలుపుతున్నాయి. శరణాగతి ఐదు అంగాలతో కూడినది అని కొందరు, ఆరు అంగాలను కలిగినదని కొందరు కూడా అంటారు.

శరణాగతిలోని ఆరు అంగాలు ఏవి? అంటే, "ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వ వరణం తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః " అని శరణాగతిలోని ఆరు అంగాలు.

మొదటిది అనుకూల్యస్య సంకల్పం. ఎవరైనా శరణాగతిని కోరి వచ్చాడు అనుకోండి. అప్పుడు అతడు భగవానునకు ఇష్టమైన పనిని చేయాలి. భగవానునకు ఇష్టమైన పనిని చేస్తానని దృఢంగా సంకల్పించుకోవాలి, శరణాగతి చేసి, తన ఇష్టం వచ్చినట్టుగా ప్రవర్తించకూడదు. భగవంతుని వలన శరణు కోరినప్పుడు, ఆ స్వామికి నచ్చినట్లుగా ప్రవర్తించాలి కదా. మన చేతిలో ఏమీ లేదు– అని తెలిసినప్పుడు ఆ స్వామికి ఆనందాన్ని కలిగించడమే మనం చేయవలసిన పని. ఆ స్వామికి ఏర్పడే విశేషమైన అభిమానమే మన అంతరించడానికి తగిన యోగ్యతను కలిగిస్తుంది. అపుడే స్వామికి మనపై అనుగ్రహం కలుగుతుంది. దానిని పురస్కరించుకునే కదా మనం తరించటానికి వీలవుతుంది. భగవానుడు " "దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే"అని పలికిన విధంగా, మనం తరించటానికి ఆయన ఏదో ఒక మార్గాన్ని అనుగ్రహిస్తాడు. అది భక్తియోగం కానీ, జ్ఞాన యోగం కానీ, ఏదైనా కావచ్చు. భగవంతుడు చూపిన దారిని దృఢంగా అవలంబించి కదామనం ఉత్తమ గతిని పొందడానికి వీలవుతుంది. అంతే తప్ప, మనం తరించటానికి మన దగ్గర ఏమీ లేదు. అందువల్ల ఆ భగవానునకు ఇష్టమైనపనిని చేసి ఆ స్వామి అభిమానాన్ని సంపాదించడం అనేది మొదటి అంగం.

విశేషణుడు ఈ అంగాన్ని ఆచరించాడా? అని అంటే, చేశాడు "ప్రదీయతాం దాశరథాయ మైథిలీ" (సీతను రామునకు తిరిగి ఇచ్చివేయి) అని రావణునకు హితాన్ని విభీషణుడు ఉపదేశించాడు. శ్రీరామచంద్రనకు రెండు విషయాలు మిక్కిలి ఇష్టపడతాయి. అందులో ఒకటి ఏమంటే, తనకు ఇష్టమైన మాటను చెబితే సంతోషిస్తాడు. లంకలో, రావణుని సభలో, ఆ రావణుడు హనుమంతుని వధించాలని ఆజ్ఞాపించినప్పుడు, దూతను వధించకూడదు– అని విభీషణుడు అన్నాడు. ఆ విధంగా రావణునకు మంచిని

బోధించడం శ్రీరామునకు ఆనందాన్ని కలిగించే విషయం. శ్రీరామునకు సంతోషాన్ని కలిగించే ఇంకొక విషయం ఏమంటే, రావణుని వంటివానికే హితాన్ని విభీషణుడు ఉపదేశించాడు కదా. ఎదుటివాడు ఎటువంటివాడు అయినా, ఎంతటి దుర్మార్గుడు అయినా, అతనికి మంచిని ఉపదేశిస్తే, ఆ పని శ్రీ రామచంద్రనకు మిక్కిలి ఇష్టం అవుతుంది. ఈ విధంగా ఇక్కడ ఈ విషయాన్ని రెండు కోణాలలో చూడాలి. మనకైతే, మనకు ఇష్టమైన మాటను చెబితే మనకు ఇష్టం అవుతుంది. శ్రీరామచంద్రులకు ఆ విధంగా కాదు. ఆత్మకు ఏది హితమో, ఆ మాట చెబితే అది అభిమతమవుతుంది. రావణుడిని ఆత్మకు ఏది హితమైన విషయం? సీతను శ్రీరామునకు తిరిగి ఇచ్చివేయడమే కదా. ఈ విధంగా రావణునకు హితాన్ని ఉపదేశించడం ద్వారా విభీషణుడు శ్రీరామచంద్రునకు ఇష్టమైన పనిని చేసి, అనుకూలంగా ప్రవర్తించినవాడు అయ్యాడు.

ఇక, శరణాగతిలోని రెండవ అంగం, "ప్రాతి కూల్యస్య వర్జనమ్" అనేది. భగవంతునకు ఏ పని ఇష్టమో, ఆ పనిని చేయడంతో పాటు, ఏది ఇష్టం కాదో ఆ పనిని చేయడం కూడా మానివేయాలి. ఇది రెండవ అంగం. ఆ విధంగా విభీషణుడు ఈ అంగాన్ని పూర్తి చేశాడా? అని అంటే, చేశాడు. "త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ" అనే విధంగా పుత్రులను, భార్యను విడచిపెట్టాడుకదా. "పరమాత్మని యో రక్తః విరక్తో ఽ పరమాత్మని" – భగవంతుని విషయంలో రాగాన్ని కలిగి ఉండడం, భగవంతుడు కానీ అన్య విషయాలలో వైరాగ్యాన్ని కలిగి ఉండడం– అనే రెండు విధింపబడ్డాయి కదా. అటువంటి వైరాగ్యం తనకు ఉన్నదనే సంగతిని పుత్రులను భార్యను విడిచి పెట్టానని చెప్పడం ద్వారా విభీషణుడు తెలియజేశాడు.

ఈ విషయంలో భగవానుడు చిన్న కుర్రవానివంటివాడు. చిన్న కుర్రవాడు తన తల్లి తననే ఎప్పుడు గమనించాలని కోరుకుంటాడు. తనను గమనించకుండా, ఇతరులను గమనించినట్లయితే అతడు సహించడు. ఇటువంటి స్వభావమే భగవంతునిది కూడా. వాస్తవానికి ఇది న్యాయమైన ఆశయే కదా. అతడే కదా సర్వస్వామి. అందువల్ల అతడు ఆ విధంగా ఆశపడడంలో న్యాయం ఉన్నది. అందువల్లనే శాస్త్రంలో పరమాత్మ విషయంలో మిక్కిలి రాగాన్ని కలిగి ఉండాలని, పరమాత్మ కాని అన్య విషయాలలో ఆశ ఏమీ లేకుండా ఉండాలని విధింపబడింది.

విభీషణుడు ఆ విధంగానే శ్రీరామచంద్రుని తప్ప అన్ని విషయాలను అన్నిటినీ వదిలి పెట్టాడు. వదిలిపెట్టినట్లుగా నివేదించాడు. "ఇంటిని వదిలి పెట్టాను, సంపదను వదిలి

పెట్టాను, భోగభాగ్యాలను వదిలిపెట్టాను, పుత్రులను, భార్యను వదిలి పెట్టాను, రాజ్యాన్ని వదిలి పెట్టాను, ఇవి అన్ని నీవే అని భావించి నిన్ను ఆశ్రయించాను" అని విభీషణుడు అన్నాడు.

ఇదే విషయాన్ని శ్రీకృష్ణుడు కూడా చరమశ్లోకంలో చెప్పాడు. "సర్వ ధర్మాన్ పరిత్యజ్య"అని అంటూ అన్ని ధర్మాలను వదిలి పెట్టమని చెప్పిన ఆ స్వామి, వదలి పెట్టిన ధర్మాలన్నీ నేనే అని భావించు, నన్నే ఆశ్రయించు– అని అన్నాడు. ధర్మాలను పూర్తిగా వదిలి పెట్టమని శ్రీకృష్ణుడు చెప్పలేదు. నీవు చేయవలసిన ధర్మాలను అన్నిటిని ఆచరించు, కర్తవ్యాలను అన్నిటినీ ఆచరించు, కానీ, నన్నే సాక్షాత్తు ధర్మంగా భావించి నన్ను ఆశ్రయించు– అని అన్నాడు.

శ్రీకృష్ణుడు ధర్మాలను అన్నిటిని వదిలిపెట్టమని చెప్పాడు, అందువల్ల ఇక ఏ ధర్మాన్ని మనం ఆచరించవలసిన పనిలేదు, ఏకాదశీ వ్రతాన్ని ఆచరించనక్కరలేదు, ద్వాదశినాడు పారణ కూడా చేయనక్కరలేదు –అని అర్థం కాదు. మనం తప్పక చేయవలసిన కర్తవ్యాలను విధిగా చేయాలి. అయితే, ఇవి మనలను రక్షిస్తాయి– అనే భావంతో కాకుండా, నీటిని చేసినట్లయితే భగవంతుని ప్రీతి కలుగుతుంది –అనే భావంతో చేయాలి. భగవంతుని కైంకర్య రూపంగా చేస్తున్నాను –అనే భావనతో చేయాలి. అందువల్ల, వారు వారు చేయవలసిన కర్తవ్యాలను తప్పక చేయాలి. భగవంతుని ప్రీతి కోసం చేయాలి. ఈ సత్యాన్ని విభీషణుడు అర్థం చేసుకున్నవాడు కనుక, రెండవ అంగాన్ని పూర్తి చేసినవాడయ్యాడు.

ఇప్పుడు, "రక్షిష్యతీతి విశ్వాసః"– భగవంతుడు తప్పక రక్షిస్తాడు అనే విశ్వాసం ఉండాలి –అనే మూడవ అంగాన్ని విభీషణుని విషయంలో చూద్దాం. విభీషణునకు, శ్రీరాముడు తనను తప్పక రక్షిస్తాడు –అనే విశ్వాసం ఉన్నందు వల్ల కదా, దూతలను పంపకుండా, తానే నేరుగా వచ్చాడు. అటువంటి నమ్మకంతో వచ్చినందువల్లనే ఆకాశంలో నిలబడి, "నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్" – విభీషణుడు శరణు కోరి వచ్చాడని శ్రీరామునకు నివేదించండి– అని వానరవీరులతో అన్నాడు. అందువల్ల, ఈ మహా విశ్వాసాన్ని శ్రీరామచంద్రుని విషయంలో కలిగినవాడై, నేరుగా తానే వచ్చి, తాను వచ్చిన విషయాన్ని విన్నవించమని వానరులకు చెప్పాడు. అంతే కాదు, తనకు నిరూపకమైన గదను తప్ప ఇక ఏ ఆయుధాలను ధరించి రాలేదు. ధైర్యంతో వచ్చాడు. ఈ విధంగా మూడవ అంశం విభీషణువిలో పరిపూర్ణంగా ఉన్నది.

నాల్గవ అంగం గోప్తృత్వ వరణం. అంటే, నీవే నాకు రక్షకుడవు– అని వరించడం. లోకంలో కన్య వరుని వరిస్తుంది. భర్తగా వరిస్తుంది. ఆ విధంగానే ఇక్కడ శరణాగతుడు శరణ్యుని ఉపాయంగా వరించాలి. భగవంతుని చరణాలను ఉపాయంగా వరించాలి. శరణాగతి అంటేనే, నీవు శరణం– అని సమీపించిడంకదా.

శరణం అనే పదం మూడు అర్థాలలో వస్తుంది. గృహం, రక్షకుడు, ఉపాయం అనే మూడు అర్థాలలో ఈ పదం ప్రయోగింపబడుతుంది. ప్రస్తుతంలో, ఇది ఉపాయం అనే అర్థంలో ప్రయోగింపబడుతున్నది. ఈ విధంగా, నీవే నాకు ఉపాయం –అని వరించాలి.

విభీషణుడు ఆ విధంగా శ్రీరాముని ఉపాయంగా వరించాడా? అని అంటే, " రాఘవం శరణం గతః, భవంతం శరణం గతః, నివేదయత మాం క్షిప్రం విభీషణముపస్థితమ్, సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే" అని ప్రతిసారి "నీవే శరణం నీవే ఉపాయం "అని శ్రీరాముని విభీషణుడు వరించాడు. అందువల్ల నాలుగవ అంగాన్ని విభీషణుడు పూర్తి చేసినట్లయినది.

ఇక, వేరొక అంశం కార్పణ్యం అనేది. "నా దగ్గర నన్ను రక్షించగలిగినది ఏదీ లేదు. నా చేతిలో నన్ను రక్షించుకోగలిగిన ఉపాయం ఏదీ లేదు" అనే నివేదించుకోవడమే ఇది. నమ్మాళ్వారులుకూడా "నోற்ற நோన్బిలేన్ నుణ్ణఱివిలేన్" (నేను కర్మయోగాన్ని ఆచరించలేదు, జ్ఞాన యోగాన్ని ఆచరించలేదు) అని అంటూ, ఈ అంగాన్ని తాము కలిగి ఉన్నట్లు తెలియజేశారు. గోదాదేవి కూడా తిరుప్పావై ప్రబంధంలో 28వ పాశురంలో" అఱివొన్రు మిల్లాద" అని అంటూ తెలియజేశారు. అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు "మీరు చేసుకున్న పుణ్యం ఏమీ లేకపోతే, నేను చేయగలిగినదేమున్నది? " అని అనగా, " స్వామీ మా దగ్గర ఏమీ లేదు అని అన్నాము తప్ప, నీవు ఏ కొరత లేని స్వామివి కదా– అని భగవంతుని పూర్ణతను, తమ ఆకించన్యాన్ని తెలియజేశారు, గోదాదేవి.

ఈ విధమైన ఆకించన్యాన్ని కూడా విభీషణుడు వ్యక్తం చేశాడు. ఏ విధంగా అంటే, "అహమస్యావరో భ్రాతా", " రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః" – నేను పరమదుష్టుడైన రావణునకు తమ్ముడను– అని రావణుని సంబంధాన్ని కలిగి ఉండడం చేత దోషాలన్నీ నిండినవాడను– అని అంటూ తనలో ఏ గుణం లేని విషయాన్ని నివేదించాడు. రావణునకు అయితే అతడు చేసిన పాపాలు మాత్రమే ఉన్నాయి, నాకైతే నేను చేసిన పాపాలే కాకుండా అతని పాపాలు కూడా అతని సంబంధం వల్ల సంక్రమించాయి– అని తన దోష పూర్ణత్వాన్ని తెలపడం కోసమే విభీషణుడు రావణ సంబంధాన్ని ప్రస్తావించాడు–

అని ఇక్కడ మన పూర్వాచార్యులు వ్యాఖ్యానం చేస్తారు. ఈ విధంగా తన దగ్గర ఏ యోగ్యత లేదని విభీషణుడు నివేదించడం వల్ల తన కృపణత్వాన్ని నివేదించినవాడయ్యాడు.

ఇక, చివరి అంగం ఆత్మ నిక్షేపం. భగవంతుని దగ్గర శరణాగతి చేయాలనీ అనుకున్నవాడు " ఈ ఆత్మ భగవంతుని సొత్తు "అని భావించాలి. దానిని భగవంతుని సమక్షంలో నివేదించాలి. ఇదే ఆత్మ నిక్షేపం. ఇక్కడ నిక్షేపం అంటే సమర్పణం.

ఈ సమర్పణం అనేది సాక్షాత్తుగా కాకుండా, భగవంతునికి ఇష్టమైన భాగవతుల ద్వారా భగవత్సన్నిధిలో సమర్పించాలి. అందువల్లనే, విభీషణుడు తనను నేరుగా నివేదించుకోకుండా, శ్రీరామునకు ఇష్టులైన వానరవీరుల ద్వారా ఈ నివేదనను చేశాడు. భగవానుడు తన శ్రీచరణాలను తమకు ఉపాయంగా అనుగ్రహించిన మహోపకారానికి బదులుగా, ప్రత్యుపకృతిగా " ఎన్ తోళ్ గళై ఆర త్త(ఝ)వి ఉయిరై అఱివిలై శెయ్ దనన్ శోదీ! (ఓ జ్యోతి స్వరూపా! స్వామి చేతులారా తడవి, నా ఈ ఆత్మను నీకు సమర్పిస్తున్నాను) అని నమ్మాళ్వార్లు కూడా అన్నారు.

ఈ విధంగానే విభీషణుడు కూడా తన ఆత్మను భాగవత సమానులైన వానరవీరుల ద్వారా శ్రీరామచంద్రుని సన్నిధిలో నివేదించాడు. అందువల్ల చివరి అంగాన్ని కూడా పూర్తి చేసినవాడయ్యాడు.

ఈ విధంగా 6 అంగాలు విభీషణ శరణాగతిలో పరిపూర్ణంగా ఉన్నాయి. శ్రీరామాయణంలో, మిగిలిన శరణాగతులలో ఎక్కడ చూసినా ఈ ఆరు పరిపూర్ణంగా కనిపించవు. ఒకటి రెండు అంగాలను అక్షేపించుకోవలసి ఉంటుంది. ఆ విధంగా కాకుండా ఇక్కడ అన్నీ పూర్తిగా ఉన్నాయి.

★★★★★

# 4. మన పూర్వాచార్యుల వ్యాఖ్యానచాతురి

భగవద్రామానుజఋసంప్రదాయం ఉభయ వేదాంత సంప్రదాయం. ఉభయ వేదాంతాలు అంటే, సంస్కృత వేదాంత, ద్రావిడ వేదాంతాలు. ఈ రెండు ఒకే విధమైన తత్త్వార్థాలను వేరు వేరు భాషలలో మనకు అందించాయి. సంస్కృత వేదాంతాలు అంటే, ఉపనిషత్తులు, గీత, ఇతిహాస పురాణాలు. ద్రావిడ వేదాంతం అంటే, , ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్య ప్రబంధాలు. మన పూర్వాచార్యులు ఆళ్వార్ల దివ్య ప్రబంధాలలోని సూక్తులను వ్యాఖ్యానించేటప్పుడు, వారి అనుభవాలను సంస్కృత వేదాంత సూక్తులతో సమన్వయించి వివరిస్తూ, ఈ రెండిటి మధ్య ఉండే ఐకమత్యాన్ని అద్భుతంగా తెలియజేశారు. అటువంటి ప్రయత్నంలో వారు, వేదానికి ప్రతిరూపంగా చెప్పబడే శ్రీరామాయణంలో పలు శ్లోకాలను ఉదాహరించి, దివ్యసూరివచనాలను వ్యాఖ్యానించారు సూక్తులను వివరించారు ఆ విధంగా వివరించేటప్పుడు, వారు అనుగ్రహించిన అద్భుతమైన అందమైన అర్థాలు అన్నీ వారి మేధావిలాసాన్ని, సందర్భశుద్ధిని నిరూపిస్తాయి. అటువంటి అర్థాలలో ఒక చక్కని అర్థాన్ని ఇప్పుడు మనం అనుసంధించుకుందాం. ప్రస్తుతం, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఒక సన్నివేశాన్ని వివరిస్తూ, నంబిళ్ళై అనుగ్రహించిన ఒక శ్రీరామాయణసూక్తి వివరణను ఆధారంగా చేసుకుని ఈ అర్థాన్ని అనుభవిద్దాం.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంలోని రెండవ శతకంలోని నాల్గవ దశకానికి అవతారికను అనుగ్రహిస్తూ నంబిళ్ళై ఈ వివరణ అనుగ్రహించారు. ఇక్కడ, సన్నివేశం ఏమంటే, నమ్మాళ్వారులు భగవదనుభవాన్ని నిరంతరంగా నిత్యసూరులతో కలసి అనుభవించాలని ఆశపడిన సందర్భం. ఈ ప్రాకృత లోకంలో ఉన్నంతకాలం ఆ విధంగా, నిత్యంగా నిత్యసూరులతో భగవంతుని అనుభవాన్ని పొందే అవకాశం లేదు కదా. అందుచేత ఆళ్వారు ఆశ నెరవేరలేదు. వారి ఆశ ప్రబలంగా ఉన్నందున, దానికి తగినట్లే వారికి ఆర్తి కూడా అధికంగా కలిగింది. దానివల్లవారు పరాంకుశ నాయకీ దశను పొందారు. వారి ఆర్తి ఎంత తీవ్రమైనది అంటే, నాయకీ భావాన్ని పొందిన ఆళ్వారులు తన ఆర్తిని నాయకిముఖంగా తెలియజేసే శక్తి కూడా లేని పరిస్థితి ఏర్పడింది. అందువల్ల పరాంకుశ నాయకికి కలిగిన ఆర్తిని భగవంతుని సన్నిధానంలో ఆమె తల్లి నివేదిస్తూ పలికే విధంగా పాశురాలను పాడుతున్నారు.

భగవంతుని అనుభవాన్ని ఒంటరిగా అనుభవించినప్పుడు కలిగే ఆనందం కంటే, ఆ స్వామి భక్తులతో కలసి దానిని అనుభవించినప్పుడు ఏర్పడే ఆనందం మిక్కుటంగా ఉంటుంది. ఇది భగవద్భక్తుల విషయంలో మాత్రమే కాదు, భగవంతుని విషయంలో కూడా అన్వయిస్తుంది అందువల్లనే, భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు కూడా "మచ్చిత్తాః మద్గత ప్రాణాః బోధయంతః పరస్పరమ్, కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ" (ఎల్లప్పుడూ నన్ను మనసులో ధ్యానిస్తూ, నా పైననే ప్రాణాలు నిలుపుకొని, నా భక్తులు నన్ను గూర్చి ఒకరికొకరు చెప్పుకుంటూ చెప్పేవారు ఆనందిస్తారు, వినేవారు కూడా ఆనందిస్తారు) అనే శ్లోకం ద్వారా తన గుణానుభవం భక్తులతో కలసి అనుభవించినప్పుడు, అది ఎక్కువ భోగ్యంగా ఉంటుంది అనే విషయాన్ని తెలియజేశారడు. ఈ విధంగా శ్రీకృష్ణ భగవానుడు పల్కడానికి కారణం ఏమంటే, భగవద్భక్తులతో కలసి ఆనందాన్ని అనుభవించేటప్పుడు కలిగే తృప్తిని ఆ స్వామి కూడా పొందాడు కనుక. పొందాలని ఆశపడతాడు కనుక.

"భగవంతుని దాసులతో కలసి, అనుభవాన్ని పొందడం అనేది ఉత్తమమైన ఆనందాన్ని కలిగిస్తుంది, దానిని పొందాలని భగవంతుడు కూడా ఆశపడతాడు "అనే ఈ విషయాన్ని నంబిళ్ళై ఒక శ్రీరామాయణ సూక్తిని ఉదాహరించి వివరించారు. ఈ సూక్తి అరణ్యాకాండలో, 16వ అధ్యాయంలో ఉన్నది పంచవటిలో, గోదావరీ తీరంలో నివసించే సమయంలో లక్ష్మణునితో శ్రీరాముడు పలికిన మాట ఇది.

లక్ష్మణుడు, కైకేయి చేసిన దుశ్చర్యను తలచుకొని, " భర్తా దశరథో యస్యాః సాధు శ్చ భరత స్సుతః, కథం ను సాంబా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ? " (దశరథుని భర్తగా, సాధువు అయిన భరతుని కుమారునిగా కలిగిన ఆ కైకేయి ఏ విధంగా ఇటువంటి క్రూరమైన స్వభావాన్ని కలిగినది అయినది? ) అని ఆమెను నిందించాడు. ఈ విధంగా లక్ష్మణుడు అనగానే, వెంటనే శ్రీరామునకు భరతుడు గుర్తుకు వచ్చాడు. తాను అతనికి దూరమై ఉండే స్థితి మనసులో మెదిలింది. ఆ భరతుడు మాట్లాడిన మధురమైన మాటలు కూడా గుర్తుకు వచ్చాయి. అప్పుడు శ్రీరాముడు" సంస్మరామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాని చ, హృద్యాన్యమృతకల్పాని మనః ప్రహ్లాదనాని చ" (అర్థపరిపూర్ణాలు, వినడానికి చాలా ఇంపుగా ఉండేవి, మధురమైనవి అమృతంవంటివి, శుభాన్ని కలిగించేవి అయిన ఆ భరతుని మాటలు నాకు గుర్తుకు వస్తున్నాయి) అని భరతుని మాటలను గుర్తు చేసుకున్నాడు. వెనువెంటనే, అతడు తనకు దూరమైన విషయం మనసులో స్ఫురణకు వచ్చింది. ఱ, భరతుడు లేని లోటు బలంగా శ్రీరాముని మనసులో మెదిలింది. అప్పుడు అతడు బాధపడుతూ, " కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ,

త్వయా చ రఘునందన! " లక్ష్మణా! ఎప్పుడు నేను, మహాత్ముడైన భరతునితో, వీరుడైన శత్రుఘ్నుతోను, నీతోను కలువగలను? ) అని అన్నాడు. ఇది శ్రీరామాయణంలోని సందర్భం.

ఈ శ్లోకాన్ని గమనించినప్పుడు, మనకు ఒక సందేహం కలుగుతుంది. శ్రీరామునకు భరతుడు, శత్రుఘ్నుడు దూరంగా ఉన్నారు, కనుక, వారిని "నేను ఎప్పుడు కలసికొంటానో కదా" అని అతడు ఆశపడడం సహజమే, తగినదే,, కానీ, లక్ష్మణుడు తన వెంటనే కదా ఉన్నాడు. అయినప్పటికీ, లక్ష్మణుని కూడా కలిపి శ్రీరాముడు ఇక్కడ పలకడంలో ఏమి అర్థం? అనే సందేహం కలుగవచ్చు. ఈ విధంగా శ్రీరాముడు పల్కడానికి కారణం ఏమంటే, సీత, లక్ష్మణుడు అనే ఇద్దరు తనతో ఎల్లప్పుడూ కలసి ఉన్నప్పటికీ కూడా, భరతుడు తన వెంట లేని కారణం చేత, వారి సాన్నిహిత్యం శ్రీరాము మనసులో తోచలేదు. అందుచేత, శ్రీరాముడు లక్ష్మణుని కూడా ఈ వాక్యంలో ప్రస్తావించాడు. లోకంలో కూడా, తనకు ఇష్టుడైన ఒకడు తన వెంట లేకపోతే, అప్పుడు ఏర్పడే బాధ, వెలితి ఎంత అధికంగా ఉంటుంది అంటే, మిగిలిన ఇష్టులైనవారు అందరూ తనతో ఉన్నప్పటికీ కూడా, ఆ సంగతి ఒక విషయంగా అనిపించదు. అందరికీ తాను దూరమైనట్లుగానే తోస్తుంది– అనేది లోకానుభవ సిద్ధం. ఈ శ్లోకంలో లక్ష్మణుడు ఒక్కడే కదా ప్రస్తావింపబడ్డాడు. మరి, సీతను గూర్చిన ప్రస్తావన కనపడలేదు కదా– అనే సందేహం కలుగవచ్చు. అయితే, శ్లోకంలో చివర ఉండే అనుక్తసముచ్చాయకమైన చకారం ద్వారా సీతాదేవి ఇక్కడ లక్షింపబడిందనిమన పూర్వాచార్యులు వ్యాఖ్యానిస్తారు. ఈ విధంగా ఇక్కడ శ్రీరాముడు పలికిన మాటనుబట్టి, భరత శత్రుఘ్నులు తన వెంట లేని కారణం చేత, లక్ష్మణుడు, సీతాదేవి కూడా తనతో లేనట్లుగానే శ్రీరామునకు తోచడం వల్ల, ఈ విధంగా అన్నాడు –అని ఇక్కడ నంబిళ్ళై వివరిస్తారు.

ఇక్కడ నందబిళ్ళై తమ వ్యాఖ్యానంలో ఒక చక్కని లౌకికమైన ఉదాహరణను కూడా ఇస్తారు. ధనాన్ని సంపాదించడంలో మిక్కిలి ఆశ కలిగినవాడు ఒకడు ఉన్నాడు అనుకోండి. అతడు సంపాదించదలచిన నిధిలో కొంత భాగం లోటుగా ఉంటే తన వెంట ఉండే భాగం కూడా లేనట్లే తోస్తుంది కదా. ఆ విధంగానే శ్రీరాముడు సీతాలక్ష్మణులతో మాత్రమే కాకుండా, భరత శత్రుఘ్నులతో కూడా కలిసి ఉండాలి అని పడినందున, అది సిద్ధించని కారణంచేత, తనతో ఎల్లప్పుడూ సీతాదేవి, లక్ష్మణుడు కలసి ఉన్నప్పటికీ కూడా, వారు తనతో లేనట్లే శ్రీరామునకు తోచింది– అని వారు వివరించారు.

ఇందువల్ల భాగవత సమాగమం, భాగవతులతో కలసి ఆనందాన్ని అనుభవించడం అనేది భగవద్భక్తులకే కాక, భగవంతునకు కూడా ఆనందాన్ని కలిగిస్తుంది, అది ఆ స్వామి దృష్టిలో ఒక అమూల్యమైన ధనంవంటివి అని తెలుస్తున్నది. ఇక్కడ, " శత్రుఘ్నేన త్వయా చ సహితేన భరతేన కదా సమేష్యామి" అని శ్లోకంలోని పదాలను అన్వయించుకోవాలి.

ప్రస్తుతం ఉదాహరించిన "కదాన్వహమ్" అనే శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ గోవిందరాజులవారు "భరత సాహిత్యభావేన విద్యమానాభ్యాం సీతాలక్ష్మణాభ్యామపి విరహితమ్ ఆత్మానం మన్యతే" (భరతుడు తన వెంట లేని కారణంచేత, లక్ష్మణుడు సీతా కూడా వెంటలేనివానినిగా తనను శ్రీరాముడు భావిస్తున్నాడు) అని వివరించడానికి కారణం పైన నంబిళ్ళై చేసిన వివరణమే అనేది నిస్సందేహం.

ఎక్కడో, ఏ మూలనో శ్రీరామాయణంలో ఉండే సూక్తిని పురస్కరించుకొని, దానితో నమ్మాళ్వారుల అనుభవాన్ని సమన్వయిస్తూ వ్యాఖ్యానించే మన పూర్వాచార్యుల మేధావిలాసాన్ని కాని, ధారణా శక్తిని కాని ఏమని పొగడగలం? ఏ విధమైన సాంకేతిక సౌకర్యాలు లేని ఆ కాలంలో, ఇటువంటి సమన్వయాలను మన పూర్వాచార్యులు చేయగలగడం అనేది వారి అసాధారణమైన ధారణను, ఉభయ వేదాంత సమన్వయ దృష్టిని నిరూపిస్తుంది. ఇంతటి అమూల్యమైన విజ్ఞాన భాండాగారాన్ని మనకు అందించిన ఆ మహోదారులకు కృతజ్ఞతలను సమర్పించుకుంటూ, వారి సన్నిధిలో నమస్కరిద్దాం. స్వస్తి.



# 5. "మడల్"– ఒక విలక్షణశృంగారరసాత్మక ప్రక్రియ

ద్రావిడ సాహిత్యానికి సంబంధించినది, దివ్యప్రబంధాలలో గోచరించేది –మడల్ అనే ద్రావిడాలంకారికప్రక్రియ. దీనిని నమ్మాళ్వార్లు తిరువాయ్ మొఴి ప్రబంధంలో "మాశఱు శోది " (5 –3) అనే దశకంలో భగవద్విషయంగా ప్రస్తావించగా, , ఈ ప్రక్రియను తిరుమంగై ఆళ్వారులు పెరియతిరుమడల్ శిఱియ తిరుమడల్ అనే రెండు ప్రబంధాలలో విస్తృతంగా నిరూపించారు. ఇపుడు దీని స్వరూప స్వభావాలను సంగ్రహంగా గమనిద్దాం.

## మడల్ ఎత్తడం ఎందుకు?

మడల్ ప్రబంధాలు ద్రావిడ సారస్వతంలో అగప్పొరుళ్ అనే విభాగంలోని లఘుకావ్యవిభాగానికి చెందినవి.

ఈ ప్రక్రియకు ఈ విధమైన పేరు ఎందుకు వచ్చింది? అనే విషయాన్ని ముందు చూద్దాం. నాయకుడు నాయకిని ప్రేమిస్తాడు. ఆమెను వివాహమాడాలని ఎంతగా ప్రయత్నించినప్పటికీ, అది అతనికి సాధ్యం కాదు. అందువల్ల అతడు తాను వలచిన నాయకిని పొందడం కోసం చివరి ప్రయత్నంగా ఈ మడల్ అనే ప్రయత్నాన్ని చేయడానికి నిశ్చయించుకుంటాడు. ఆ విషయాన్ని ఆమె బంధువులకు తల్లిదండ్రులకు తెలియజేస్తాడు. అప్పటికీ, నాయకికి సంబంధించినవారు ఆమెను తనకు ఇచ్చి వివాహం చేయడానికి సిద్ధపడకపోతే, నిజంగానే మడల్ ను ఎత్తుతాడు. ఈ విధంగా నాయకుడు నాయకిని పొందడం కోసం మడల్ ఎక్కడం అనే ప్రయత్నం ఈ కావ్యంలో వర్ణింపబడుతున్నందున దీనికి మడల్ అనే పేరు వచ్చింది.

## మడల్ స్వరూపం

ఇప్పుడు, మడల్ ఎత్తడం అంటే ఏమి? ఏ విధంగా నాయకుడు ఆ ప్రయత్నాన్ని చేస్తాడు? అనే విషయాన్ని చూద్దాం. తాటి చెట్టు మట్టకు ద్రావిడ భాషలో మడల్ అని పేరు. దీనికి రెండు వైపులా చాలా పదునుగా ఉండే ముళ్ళు ఉంటాయి. ఇటువంటి తాటి చెట్టు మట్టలతో గుర్రం వంటి ఒక రూపాన్ని నిర్మిస్తారు. ఆ వాహనంపై నాయకుని ప్రేమించిన నాయకుడు ఎక్కుతాడు ఈ వాహనానికి కింద చక్రాలు అమరుస్తారు. దానిని నాయకుని స్నేహితులు వీథులలో లాగుతూ తీసుకొని వెళతారు. నాయకుడు ఒక తాటి మట్టతో తన శరీరం పై కొట్టుకుంటూ, తన ప్రేమోదంతం ఏ విధంగా ఫలించలేదో ఊరిలోని వారికి అందరికీ తెలియజేస్తూ ఉంటాడు.

తాటి మట్టలతో చేసిన గుర్రంలో నెమలిపించాన్ని అలంకరిస్తారు. మాడల్ ను ఎత్తే ప్రేమికుడు తన శరీరం నిండుగా బూడిదను పూసుకుంటాడు నాయకి చిత్రాన్ని వ్రాసిన వస్త్రాన్ని చేతిలో పట్టుకుంటాడు. ఊరిలోని నాలుగు మార్గాల కూడలిలోకి వెడతాడు. తన చేతిలో ఉండే నాయకి చిత్రాన్నే తదేకంగా చూస్తూ ఉంటాడు. నిద్రాహారాలు మానివేస్తాడు. చివరికి నిప్పు అంటుకున్నా ఏమీ తెలిసికోలేని ఒక విధమైన తన్మయావస్థలో ఉంటాడు. ఎండ, గాలి, వాన మొదలైన వాటిని పట్టించుకోడు. ఈ విధంగా నాయకుడు మడల్ ను ఎత్తడం గమనించిన ఊరిలోనివారు తగదని చెప్పినా, నిందించినా పట్టించుకోకుండా నాయకిని గూర్చి మాట్లాడుతూ ఉంటాడు. సంగ్రహంగా ఇది మడల్ స్వరూపం.

## మడల్ ప్రయోజనం

నాయకుడు ఈ విధంగా మడల్ ను ఎత్తడంలో ఏ ప్రయోజనం ఉన్నది? దీని ఫలమేమి? అని అంటే, మడల్ ఎత్తే నాయకుని దుఃఖాన్ని ఊరిలో ఉండేవారు గమనిస్తారు. అతని దుఃఖం తీర్చడం కోసం నాయకిని నాయకుని దగ్గరకు తీసుకుని వచ్చి చేర్చడానికి ప్రయత్నిస్తారు. ఇందువల్ల మడల్ ఎత్తడం ద్వారా నాయకుడు నాయకిని పొందడానికి అవకాశం ఉన్నది.

ఇంతే కాక, నాయకుని కామార్తి తీర్చుకోవడం కోసం ఈ ఒక్కటే దారి అని అతను భావిస్తున్నాడు. అందుచేతనే "మడల్ అనే విధానాన్ని కామం" అనే సముద్రాన్ని దాటడానికి తగిన పడవ అని ద్రావిడలక్షణ శాస్త్రాలు తెలుపుతున్నాయి.

తిరువళ్లువర్ కూడా ", కామమ్ ఉழన్దు వరుందినవర్ క్కు ఏమమ్ మడల్ అల్లదు ఇల్లై వలి" (కామం వృద్ధి చెంది బాధపడే వారికి రక్షణ ఏమంటే, దృఢమైన మడల్ ను తప్ప వేరొక ఉపాయం ఏదీ లేదు) అని అన్నాడు.

## మడల్ లోని రెండు స్థితులు

నంబి ఆగప్పొరుళ్ అనే ద్రావిడ సాహిత్యలక్షణ గ్రంథం ఈ ప్రక్రియను రెండు విధాలైన విభాగాలను కలిగినదిగా తెలియజేస్తున్నది. ఆ రెండు ప్రకారాలు ఏమి? అంటే, మడల్ కూற்று, మడల్ విలక్కు అనేవి.

నాయకుడు, నాయకుని పొందడానికి మడల్ ఎత్తుతాను– అని అనడం మడల్ కూற்று, అనబడుతుంది. " ఆ విధంగా నీవు మడల్ ఎత్తకు " అని నాయకుని నిషేధించడం మడల్ విలక్కు అనబడుతుంది.

## సంఘసాహిత్యంలో మడల్

సంఘ సాహిత్యంలో అగప్పొరుళ్ అనే విభాగానికి సంబంధించిన ప్రక్రియలలో ఈ మడల్ ప్రక్రియకు సంబంధించిన విశేషాలు కనబడుతున్నాయి. ఉదాహరణకు, కలిత్తొగై అనే గ్రంథంలో మడల్ ఎత్తే విషయాన్ని గూర్చిన ప్రస్తావన 139 వ పాశురంలో కనబడుతున్నది.

## మొదటి మడల్ లక్షణ ప్రకారాల గ్రంథాలు

ఈ విధంగా లక్షణ గ్రంథాలలోనూ, లక్ష్య గ్రంథాలలోనూ కనబడే మడల్ అనేది మడల్ ఎత్తడాన్ని గూర్చిన నియయాలను ఆధారంగా చేసుకుని, మడల్ అనే ప్రత్యేకమైన ఒక ప్రబంధ ప్రకారం ఆవిర్భవించింది అని చెప్పవచ్చు. ఈ విధంగా మడల్ అనే పేరుతో ఆవిర్భవించిన ద్రావిడ శృంగార కావ్యాలలో తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అనే రెండు ప్రబంధాలు మొట్టమొదటివి. అని భావింపబడుతున్నది.

## మడల్ ఎత్తడంలో కొన్ని నియమాలు

మడల్ ఎత్తడం అనేది మగవారికి మాత్రమే తగినది, స్త్రీలకు తగినది కాదు– అని ఒక సంప్రదాయం ఉన్నది. కామం కారణంగా స్త్రీలు దుఃఖాన్ని పొందుతారు. కానీ, వారు మడల్ ఎత్తడం అనేది అంగీకరింపబడలేదు. ఈ సంప్రదాయాన్ని బలపరిచే రీతిలో "కడలన్న కామమ్ ఉழన్దుమ్ మడల్ ఏఱా ప్పెణ్ణిన్ ప్పెణ్ణిన్ పెరుందక్కదు ఇల్ " (సముద్రం అంతగా కామం వృద్ధి చెంది బాధపడినప్పటికీ స్త్రీలు మడల్ ఎత్తడం అనేది ప్రశంసనీయం కాదు) అని తిరుక్కుఱళ్ గ్రంథం పలుకుతున్నది. సముద్రం అంత విస్తృతంగా కామార్తి ఏర్పడినా, దానిని పోగొట్టుకోవడం కోసం స్త్రీలు మడల్ ను ఎత్తకుండా, దానిని తమలోనే పెట్టుకొని సహించడానికి ప్రయత్నం చేస్తారు. అందుచేత స్త్రీల సహనం కంటే గొప్పది ఇంకొకటి లేదు– అని దీని తాత్పర్యం.

## ఈ సంప్రదాయంలో మార్పు

"స్త్రీలు ఏమైనా, మడల్ ను ఎత్తకూడదు "అనే ఈ సంప్రదాయానికి విరుద్ధంగా అవతరించిన ప్రబంధాలు తిరుమంగై అళ్వార్లు అనుగ్రహించిన పెరియతిరుమడల్, శిఱియ తిరుమడడల్ అనే ప్రబంధాలు. ఈ ప్రబంధాలలో నాయకుని పొందడం కోసం నాయకి మడల్ ఎత్తబోతానని చెబుతుంది. ఇక్కడ "స్త్రీలు మడల్ ఎత్తడం లేదు", అనే సంప్రదాయంలో మార్పు కనబడుతున్నది.

## దీనికి కారణం

ఈ విధమైన మార్పుకు కారణం ఏమి? అని గమనించాలి. ఆళ్వారులు అవతరించిన కాలం భక్తి మహోద్యమంగా సాగే కాలం. ఈ కాలంలో ఆవిర్భవించిన ప్రబంధాలలో, దేవతలు, భగవంతుడు నాయకునిగా భావింపబడి వర్ణింపబడ్డారు. దేవతలకు, లేక, భగవంతునకు గొప్పతనాలను, వారితో తమకు ఉండే సంబంధాన్ని తమ ప్రబంధాలలో వారు కీర్తించారు. భక్తి రసాత్మకమైన ప్రబంధాలను రచించిన పూర్వకవులు తమ ద్రావిడ లక్షణ సంప్రదాయాన్ని వదిలిపెట్టగోరలేదు. తమ కావ్యాలలో ద్రావిడ సాహిత్య శృంగార ప్రక్రియలను సమన్వయం చేస్తూ, రచనలను చేయాలని ప్రయత్నాలు చేశారు. అందుచేత, భగవంతుని నాయకునిగా, తమను నాయకిగా భావించి, పలు పాశురాలను పాడారు. దీనికే నాయక నాయకీభావం అని అంటారు. ఈ క్రమంలో, సంఘుసాహిత్య శృంగార రస ప్రక్రియలు భక్తి రసాత్మక ప్రబంధాలలో చాలా చోట్ల గోచరిస్తాయి. భక్తిరసాత్మక ప్రబంధాలలో, సంఘు కాలీన శృంగార రసాత్మక ప్రక్రియలను కొన్నింటిని కొన్ని మార్పులతో వర్ణించడానికి వారు ప్రయత్నం చేశారు. అటువంటి ప్రయత్నాలలో తిరుమంగై ఆళ్వారుల అనుగ్రహించిన శిఱియ తిరుమల్, పెరియ తిరమడల్ అనే రెండు ప్రబంధాలు అంతర్భవిస్తాయి.

ఈ ప్రబంధాలలో, భగవంతునిపై అంతులేని ప్రేమను కలిగిన నాయకి నాయకుడైన భగవంతుని పొందడానికి చేసిన ప్రయత్నంగా నాయకి "మడల్ ఎత్తుతాను" అని అంటుంది. ఈ రీతిలో ఉండే ప్రబంధాలు పై రెండు ప్రబంధాలు. అందుచేత, మడల్ లక్షణాలలో "స్త్రీలు మడల్ ను ఎత్తడం అనేది లేదు", అనే సంప్రదాయం మారి, స్త్రీలు కూడా మడల్ ఎత్తుతారు", అనే సంప్రదాయలో మార్పు ఏర్పడింది. అంతేకాక, ఆళ్వారుల లౌకికమైన కామం కాదు. లౌకికమైన కామాన్ని కారణంగా కలిగిన ప్రేమ కాదు. ఇక్కడ ఆశపడేది, మహానంద రూపమైన మోక్షాన్ని. పొందాలనే కోరిక. అందుచేత, తిరుమంగై యాళ్వార్లు ఈ విధంగా సాంప్రదాయకమైన మడల్ నియమాలకు కొన్ని మార్పులను చేసి, తమ ప్రబంధాలను అనుగ్రహించారు– అని భావించవచ్చు.

## ఆళ్వారుల ప్రబంధాలలో మడల్

దివ్యసూరులు తమ దివ్య ప్రబంధాలలో వేదప్రతిపాదితాలైన అర్థాలను మధురమైన ద్రావిడ భాషలో పాశురాల రూపంగా అందించారు. ఈ విధంగా వారు పాశురాలను అనుగ్రహించేటప్పుడు వేదతత్వార్థాలను ఆవిష్కరించడం కోసం ద్రావిడ

సాహిత్యాలంకార ప్రక్రియలను, ఆ సాహిత్యంలో ఉండే శృంగార రసాత్మక ప్రక్రియలను ప్రయోగించారు. పరమ పవిత్రమైన వేదార్థాలను ఆవిష్కరించడం కోసం శృంగార రసాత్మక ప్రక్రియలను వారు ప్రయోగించడంలో తాత్పర్యాన్ని గుడజిహ్వికాన్యాయాన్ని అనుసరించి అర్థం చేసుకోవాలని మన పూర్వాచార్యుల వివరణం. సర్వాత్మ సాధారణమైన, అందరినీ ఆకర్షించే శక్తిని కలిగిన రసం శృంగారసమే. అందువల్లనే దానికి శృంగారం అనే పేరు వచ్చింది అని కూడా ఆలంకారికులు చెబుతారు. "శృంగమ్ ఉన్నత స్థానమ్, ఇయర్తి ప్రాప్నోతి. ఆతి శృంగారః " – ఉన్నతమైన స్థానాన్ని పొందుతున్నది కనుక శృంగారమని చెప్పబడుతున్నది – అనేది ఈ పదానికి కల వ్యుత్పత్తి. ఇంతే కాక, వేదం కూడా " ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని అంటూ పరమాత్మ విషయంగా ఉండే కామం (కోరిక) ప్రాప్యమే అని చెప్పింది. అంతేకాక, "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః", " స్త్రీ ప్రాయమ్ ఇతరత్ సర్వమ్" అనే సూక్తులు పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు ఒక్కడే పురుషుడని, మిగిలిన జీవులందరూ ఆ స్వామికి అనన్యశేషభూతులు కనుక, స్త్రీలవంటివారే అని తెలుపుతున్నాయి. అందుచేత ఆళ్వారులు భగవంతుని విషయంలో తమకు గల భక్తిని ఆత్మస్వరూపానికి తగినట్లుగా నాయికా భావనతో వ్యక్తం చేశారు. ఈ విధంగా వ్యక్తం చేసేటప్పుడు వారు ద్రావిడ సాహిత్యంలో ఉండే శృంగార రసాత్మక ప్రక్రియలను అనుసరించి పాశురాలను పాడి, జీవునకు భగవద్విషయంలో ఉండే కామం అనేది ఉపాదేయమే అనే తత్త్వాన్ని వెల్లడించారు.

ఎక్కడ విశేషం ఏమంటే, చాలామంది ద్రావిడకవులు ఈ శృంగార రస ప్రక్రియలను తమ కావ్యాలలో ఈ లోకంలోని వ్యక్తుల మధ్య ఉండే ప్రేమను వర్ణించడానికై ఉపయోగించారు. అందుచేత ఈ ప్రక్రియలకు పరిపూర్ణమైన సార్థకత కలుగలేదు. వాగ్రూపమైన ఏ ప్రక్రియ అయినా, భగవంతుని విషయంలో ప్రయోగింపబడినప్పుడు కదా, అది పరిపూర్ణమైన సార్థక్యాన్ని పొందుతుంది. ఆళ్వార్లు శృంగారసాత్మక ప్రక్రియలను తమకు భగవంతుని విషయంలో ఉండే ప్రేమను వ్యక్తం చేయడానికి ఉపయోగించినందున, ఆ ప్రక్రియలకు సార్థకత దివ్యప్రబంధాలలోనే పరిపూర్ణంగా సిద్ధించింది.

మడల్ అనే ఈ ప్రక్రియ అతిప్రవృత్తిని, సాహసాన్ని సూచించే ప్రక్రియ కదా. భగవంతునకు శేషభూతుడై ఉండే జీవుడు ఆ భగవంతుని విషయంలో ఇటువంటి అతి ప్రవృత్తిని, సాహసాన్ని తెలియజేసే మడల్ ను ఎత్తవచ్చునా? ఆళ్వారులు మడల్ ఎత్తుతానని అనడం ఏ విధంగా జీవస్వరూపానికి తగినది? అనే విషయం కూడా ఇక్కడ గమనించవలసి

ఉన్నది. ఈ విషయాన్ని మన పూర్వాచార్యులు ఈ విధమైన, యుక్తమైన సమాధానాన్ని తెలియజేశారు. అష్టాక్షరీ మంత్రంలో ఉండే" ప్రణవం, నమస్సు, నారాయణాయ ", అనే మూడు పదాలు, వరుసగా, జీవుని అనన్యార్హశేషత్వాన్ని, అనన్య శరణత్వాన్ని, అనన్య భోగ్యత్వాన్ని తెలుపుతున్నవి. ఈ మూడిటిలో, మూడవ పదంతో చెప్పబడే అనన్యభోగ్యత్వాన్ని భక్తుడు మనసులో భావించినప్పుడు, భగవంతుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని, కల్యాణ గుణాలను భావించినప్పుడు, వెంటనే ఆ స్వామి దగ్గరకు చేరాలని, ఆ స్వామికి కైంకర్యాన్ని చేసుకోవాలి అనే తొందరగా మనసులో కలుగుతుంది. ఆ ఆశ వెను వెంటనే తీరకపోతే, ఏ ప్రయత్నాన్ని చేసి అయినా ఆ స్వామిని పొందాలనే ఉత్కటమైన అభిలాష ఏర్పడుతుంది. దాని కారణంగానే ఈ మడల్ అనే ప్రక్రియను భక్తుడు అనుసరించడం జరుగుతుంది. అందుచేత ఇక్కడ ఆళ్వారులు మడల్ ఎత్తడం అనేది వారు స్వామిని వెంటనే దర్శించి, ఆ స్వామికి స్వరూపానురూపమైన సేవలను చేసుకోవాలనే వారికి కలిగిన ఆశను, త్వరను వ్యక్తం చేస్తుంది, కనుక, ఆళ్వారులు మడల్ ఎత్తుతానని అనడం తప్పు కాదు. అంతకు మించి, అది వారి భక్తిలోని ఉత్కర్షను తెలుపుతుంది కనుక శ్లాఘనీయమే.

నంబిళ్ళై తిరువాయ్ మొరఴి ఈడువ్యాఖ్యానంలో, (5–3) దశకానికి అవతారికను అనుగ్రహిస్తూ, ఈ ప్రక్రియకు సంబంధించిన విశేషాలను చాలా వివరంగా అనుగ్రహించారు. ఆ సందర్భంలో, వారు ఇంచుమించుగా మడల్ ను ఎత్తడం వంటి ఒక ప్రయత్నాన్ని సీతాదేవి శ్రీరాముని విషయంలో చేసిందని అన్నారు. ఏ విధంగా అంటే, శ్రీరాముడు అరణ్యాలకు వెళ్ళేటప్పుడు సీతాదేవిని అయోధ్యలోనే ఉండి అత్తమామలను జాగ్రత్తగా కాపాడమని ఆమెకు చెప్పాడు. కానీ ఆమె అందుకు అంగీకరించక, పట్టుబట్టి, శ్రీరాముని తో పాటు అరణ్యాలకు బయలుదేరి వెళ్ళింది. " యా న శక్యా పురా ద్రష్టుం భూతై రాకాశగైరపి" అనే విధంగా అంతఃపురకాంత బయటకు రాకూడదు అనే నియమాన్ని కూడా ఉల్లంఘించి, ఆమె అందరికీ కనిపించే విధంగా రాజవీధులలో శ్రీరామునితో పాటు వెళ్ళింది కదా. ఇది ఒక అతిప్రవృత్తియే కనుక, ఇది కూడా మడల్ వంటిదే అని ఆ ఆచార్యులు అందంగా వివరించారు.

★★★★★

# 6. ఆళ్వారుల దివ్యప్రబంధాలలో "శెవిలి త్తాయ్ " దశ

## (పెంపుడు తల్లి భావన)

భగవంతుని ఆరాధించేటప్పుడు, తనను భక్తునిగా, దాసునిగా భావించి, ఆరాధించడం అనేది ఒక విధమైన, సాధారణమైన క్రమం. చాలామంది ఆళ్వారులు, నాయన్మార్లు ఈ క్రమాన్నే అనుసరించారు.

భగవంతుని నాయకునిగాను, తనను నాయకిగాను భావించి సేవించడం ఇంకొక క్రమం. నమ్మాళ్వారులు ఈ క్రమంలో పాశురాలను తమ ప్రబంధాలలో పాడారు. శెవిలిత్తాయ్. (పెంచిన తల్లి) తన కూతురు స్థితిని చూసి బాధపడుతున్నట్లుగా తిరువాయ్ మొழி దివ్య ప్రబంధం పలికే దశకాలలో, , ", "మణ్ణైయిరున్దుழாవి" అనే దర్శకం ఒకటి. ఈ దశకంలో పెంపుడు తల్లి– భగవంతునిపై ఆశను పెంచుకొని, ఆ స్వామిని పొందలేక, తన కుమార్తె పడే బాధను గూర్చి పలుకుతూ – "నా కుమార్తె భూమిని తాకి ఇది వామనుడు కొలిచిన భూమి అని అంటున్నది. ఆకాశాన్ని చూచి నమస్కరించి, అది అతడు ఉండే వైకుంఠం అని అంటున్నది. సముద్ర వర్ణాన్ని చూచి, కన్నీళ్లు నిండిన కన్నులతో ఇది అతని వర్ణం అని అంటూ వెక్కుతున్నది. ఈమెను ఈ స్థితికి తీసుకొనే వచ్చివాడవు నీవు. ఏమి చేయను? " నేను అని పెంపుడు తల్లి ఆక్రందిస్తున్నట్లుగా ఈ దశకంలో మనకు దృశ్యాన్ని ఆళ్వార్లు చిత్రీకరించారు. ఇది ఒక విధమైన పెంపుడు తల్లికి సంబంధించిన సన్నివేశం.

ఈ విధంగా అనేక విధాలైన మనఃస్థితులలో భగవంతునితో తాము ఒకటిగా కలిసి వుండి విశ్లేషం లేని స్థితిని పొందడం కోసం భక్తులు భావించేటప్పుడు, తమను తల్లిగాను, భగవంతుని తన కుమారునిగాను భావించి భక్తిని వ్యక్తం చేశారు. పెరియాళ్వార్లు తనను యశోదా దేవిగా భావించి, శ్రీకృష్ణుని భార్య లీలలను అన్నిటినీ తాను అనుభవిస్తున్నట్లుగా తమ ప్రబంధంలో పాశురాలను పాడారు.

పెరియాழ்వార్ తిరుమొழி అనే ప్రబంధం దివ్య ప్రబంధాలలోని మొదటి సహస్రంలో అంతర్భవించింది. ఈ ప్రబంధంలోని నీరాట్టం, పూచ్చూట్టల్, కాప్పిడల్ మొదలైన దశకాలలో వారి పెంపుడు తల్లి భావనను వ్యక్తమవుతున్నది.

ఇక్కడ ఒక విశేషం ఉన్నది. అన్య మనఃస్థితులలో పాడబడిన పాశురాలు అన్నీ భగవంతుని ఉద్దేశించి, ఆ స్వామి దగ్గర ఏదైనా ఒక విషయాన్ని ప్రార్థిస్తున్నట్లుగానే

ఉంటాయి. ఉదాహరణకు, మరో జన్మ లేని మోక్ష దశ కావాలి అనేది ముఖ్యమైన ప్రార్ధనగా మనకు కనబడుతుంది. కానీ, పెంపుడు తల్లి అనే దశలో పాడబడిన పాశురాలు మాత్రం, తనకోసం ఏ విధమైన కోరికను కానీ ప్రార్థించే విధంగా కాకుండా, భగవంతునిపై అక్కరను ప్రదర్శించేటట్లుగా, ఆ స్వామికి ఏ విధమైన హాని కలుగకూడదు అని, దృష్టి దోషం తగుల కూడదు అని– ఈ విధంగా భగవంతుని క్షేమాన్ని మాత్రమే అన్వేషిస్తున్నట్లుగా ఉంటాయి.

పెరియాళ్వారులలో గోచరించే పెంపుడు తల్లి భావనయే వారిని పెరియాళ్వారుగా, అంటే, గొప్ప ఆళ్వారులుగా చేసింది. ముదలాడళ్వారులు ముగ్గురు కాలాన్ని బట్టి పెద్దవారు. వారే మొట్టమొదటి ప్రబంధాలను పాడారు. కానీ, పెరియాళ్వార్ల తిరుప్పల్లాండు దివ్య ప్రబంధంతోనే దివ్య ప్రబంధ పాశురాల అనుసంధానం ప్రారంభమవుతుంది. భగవంతుని తిరుమేనికి ఏ విధమైన భంగం కలుగకూడదు అనే తల్లి ప్రేమతో పలకడంతో పాటు, తమ కోసంగా ఏ విధమైన కోరిక లేకుండా పెరియాళ్వార్లు ఈ ప్రబంధంలో పలకడం వల్ల నాలాయిర దివ్యప్రబంధంలో ఈ ప్రబంధం మొదటి స్థానాన్ని పొందింది.

"శెవిలిత్తాయ్" భావన ఇంతటి గొప్పది గొప్పతనాన్ని కలిగినది.

★★★★★

# 7. శ్రీసుదర్శనవైభవమ్

“స్ఫురత్సహస్రారశిఖాతితీవ్రం
సుదర్శనం భాస్కరకోటితుల్యమ్,
సురద్విషాం ప్రాణవినాశి విష్ణోః
చక్రం సదాహం శరణం ప్రపద్యే”

భగవానుడైన శ్రీమన్నారాయణుడు “సర్వప్రహరణాయుధః” (అన్ని విధాలయిన దివ్యాయుధాలను కలవాడు) అని కీర్తింపబడేటట్లుగా సకల విధాలయిన దివ్యాయుధాలను ధరిస్తాడు. వాటిలో అన్నిటిలో సుదర్శన చక్రాయుధమే అగ్ర గణ్యమైనది. అందుచేతనే పరాశరభట్టర్ శ్రీరంగ రాజస్తవంలో “అస్త్రగ్రామాగ్రేసరమ్”అంటూ ఈ ఆయుధాన్ని స్తుతించారు. ఈ చక్రాయుధాన్ని భగవానుడు “వలక్కై ఆళ్హి “ (కుడి చేతిలో చక్రాయుధం) అనే విధంగా సామాన్యంగా కుడిచేతిలో ధరిస్తాడు. ఈ సుదర్శన భగవానుని వైభవం భగవద్వైభవం వలె అప్రమేయం, అసాధారణం, దానిలోని ఆల్పాల్పాంశాన్ని అనుభవించడానికి ఇక్కడ ప్రయత్నం చేద్దాం.

ఈ సుదర్శన వైభవం వేదాలలో, పురాణాలలో, ఇతిహాసాలలో, ఆగమాలలో, ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో, పూర్వాచార్యుల వ్యాఖ్యానశ్రీసూక్తులలో, వారి గ్రంథాలలో విస్తృతంగా నిరూపింపబడింది. వాటిలోని కొన్ని అంశాలు దిఙ్మాత్రంగా ఇక్కడ ఉదాహరింపబడుతున్నాయి.

## వేదవాఙ్మయంలో సుదర్శన వైభవం

వేదసారస్వతంలోని పలు ప్రమాణాలు సుదర్శన వైభవాన్ని కీర్తిస్తున్నాయి. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అనే మూడు వేదాలలో చక్రాయుధవైభవం తెలియజేసే ఈ సూక్తం కనిపిస్తున్నది.

పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే
ప్రభుః గాత్రాణి పర్యేషి విశ్వతః
అతప్తతనూః న తధామో అశ్నుతే
శ్రుతాస ఇద్వహంతః తత్సమాశత”

భగవన్! నీవు చతుర్భుజ బ్రహ్మకు సమస్తమైన అధికారాన్ని అనుగ్రహించావు. నీ సుదర్శన చక్రాయుధం అన్నిటిలోనూ వ్యాపించి ఉన్నది. ఏ జీవుడు నీ సుదర్శనంచేత

సంస్కరింపబడడో, అతని పాపాలు పూర్తిగా నశించవు. అతడు పరమాత్మను చేరలేడు. ఎవడు చక్రాంకధారణాన్ని చేస్తాడో, అతడు నశించిన పాపాలను కలవాడై, బ్రహ్మప్రాప్తిని పొందుతాడు.

### ఋగ్వేదంలో

చమూషచ్ఛ్యేన శ్శకునో బిభృత్వా
గోవిందుద్రథ ఆయుధాని బిభ్రత,
అసామూర్మిం సవమాన స్సముద్రం
తురీయం ధామ మహేషో వివక్తి

పాంచభౌతికమైన శరీరాన్ని కలవాడు, భగవదంశభూతుడైన జీవాత్మ భగవానుని చక్రాయుధం చేత సంస్కరింపబడినవాడై, స్తుతించదగిన ఆ భగవంతుని సాన్నిధ్యాన్ని పొందుతున్నాడు. సంసార సముద్ర తీరాన్ని చేరడంలో సమర్థుడు అవుతున్నాడు. అంతేకాక, తన బంధువులను సైతం తరింప చేస్తున్నాడు. ఆదరణీయుడైన ఆ సజ్జనుడు సర్వోన్నతమైన పరమపదాన్ని పొందగలుగుతున్నాడు.

"చక్రం బిభర్తి వపుషాభితప్తం బలం దేవానా మమితస్య విష్ణోః,
స యాతి నాకం దురితం విధూయ ప్రయాంతి యద్యతయో వీతరాగాః"

తప్తమైన శ్రీసుదర్శన చక్రం వల్ల దేవతలకు బలం కలుగుతున్నది. ఆ చక్రాన్ని ధరించేవాడు పాపాల నుండి విముక్తుడై పరమపదాన్ని పొందుతాడు. వీతరాగుడై యతి అవుతాడు.

### సామవేదంలోని మైత్రాయణీశాఖలో

"పవిత్రమిత్యగ్నిః, అగ్నిర్వై సహస్రారః, సహస్రారో నేమిః, నేమినా తప్తతనూః బ్రహ్మణః సాయుజ్యం సలోకతామాప్నోతి"

పవిత్రమైన సహస్రార చక్రంచేత తప్తమైన శరీరం కలిగినవాడు పరబ్రహ్మ సాయుజ్యాన్ని పొందుతాడు.

### యజుర్వేదానికి చెందిన తైత్తిరీయ కాఠకంలో

చరణం పవిత్రం వితతం పురాణం
తేన పూతః తరతి దుష్కృతాని
తేన పవిత్రేన శుద్ధేన పూతాః

అతిపాప్మాన మరాతిం తరేమ
లోకస్య ద్వార మర్చిమత్ పవిత్రం
జ్యోతిష్మత్ భ్రాజమానం మహస్వత్
అమృతస్య ధారా బహుధా దోహమానం
చరణం నో లోకే సుధితాం దధాతు.

పురాతనమైనది, పవిత్రతను కలిగించేది, మోక్ష సాధనమైనది అయిన సుదర్శన చక్రం అన్నిటిలో వ్యాపించి ఉన్నది. ఏ సుదర్శనంచేత పవిత్రుడైన జీవుడు పాపాలను అన్నిటినీ దాటుతున్నాడో, ఆ సుదర్శన చక్రంతో మనం పవిత్రులమై, శత్రువుల వంటి పాపాల నుండి విముక్తులను అవుతాము. లోకంలోని జనుల మోక్ష సాధనమైన సుదర్శన చక్రం యొక్క జ్వాలలలో కోటి కిరణాల ప్రకాశం ఉన్నది. మోక్షాన్ని కలుగజేసే ఆ సుదర్శన చక్రం మనకు ఆదిభౌతిక ఆధి దైవిక ఆధ్యాత్మిక సుఖాలను అన్నిటినీ ఇచ్చుగాక.

### యజుర్వేదంలోని ద్వితీయాష్టకంలో

"యేన దేవాః పవిత్రేణ ఆత్మానం పునతే సదా తేన సహస్రధారేణ పావమాన్య పునంతు మామ్"

పవిత్రమైన ఏ చక్రాయుధంచేత దేవతలు తమను పవిత్రం చేసుకుంటున్నారో, అటువంటి సహస్రార చక్రమైన సుదర్శనం నన్ను కూడా పవిత్రునిగా చేయాలి.

### అధర్వణవేదంలో

"ఏభి ర్వయ మురుక్రమస్య చిహ్నై రంకితా లోకే తద్విష్ణోః పరమం పదం గచ్ఛన్తి హి లాంఛితా లోకే"

భగవంతుని చిహ్నమైన చక్రం మొదలైనవానిచేత అంకితులమైన మనం పాపాలను పోగొట్టుకుని సుఖంగా ఉంటాము. ఎందువల్ల అంటే, ఎవరు చక్రాంకనాన్ని పొందుతారో, వారు విష్ణు స్థానమైన పరమ పదాన్ని తప్పక పొందుతారు.

### శతపథ బ్రాహ్మణంలో

"దేవాసః పితరో యేన విధృతేన బాహునా సుదర్శనేన ప్రయాతాః స్వర్లోకమాయన్, యేనాంకితో మానవో లోకసృష్టిం వితన్వంతి, బ్రాహ్మణా స్తద్వహంత్యగ్నినా వై హోత్రా తప్తం చక్రం ద్విభుజే ధార్యమ్ ఇత్యూర్ధ్వపుండ్ర మాలిఖేత్.

తస్మాత్ ద్విరేఖం భవతి పునరాగమనం న యాతి, బ్రహ్మణః సాయుజ్యం సలోకతాం యంతి, య ఏవం వేద"

పుత్రునకు తండ్రి వలె, లోకానికి హితన్ని కోరే దేవతలు సుదర్శనచక్రం చేత లాంచితులై, పరమపదమును చేరగల్గుదురు. మనవు కూడా చక్ర లాంఛితుడై, సమస్త సృష్టిని చేయగలిగాడు. అటువంటి అగ్నితప్తమైన చక్రంచేత ముద్రింపబడిన విప్రులు ఊర్ధ్వపుండ్రాలను ధరించినవారై, పరమపదాన్ని చేరుతారు. అందువల్ల తప్తచక్రాంకితుడైన మానవుడు తిరిగి జన్మను పొందడు. పరమ పురుషుడైన విష్ణువుతో సాయుజ్యాన్ని పొందుతాడు. ఎవరు ఈ విషయాన్ని తెలుసుకుంటారో, వారు క్రమంగా సదనుష్ఠానాన్ని ఆచరించి, చక్రాంకితులై, మోక్ష ప్రాప్తిని పొందుతారు.

### సుదర్శనోపనిషత్తులో

"యజ్ఞోపవీతీ కృతచక్రధారీ
యో బ్రహ్మవిత్ బ్రహ్మవిదో మనీషా
స్త్రీశూద్రా సంబాహుభ్యాం ధారయేత్"

యజ్ఞోపవీతాన్ని ధరించివాడు, తప్తచక్రాంకితుడు అయిన బ్రహ్మవేత్త స్త్రీశూద్రాదులను తగిన విధంగా తమ బాహువులలో చక్రధారణాన్ని కలిగి ఉండేటట్లు చేయాలి.

ఈ విధంగా చాలా వేద ప్రమాణాలు తప్తచక్రాంకనావశ్యకతను తెలుపడం ద్వారా సుదర్శన వైభవాన్ని ఉగ్గడిస్తున్నాయి. ఈ సందర్భంగా ఈ విష్ణుసహస్రనామ స్తోత్రంలోని "కృతలక్షణః" హ అనే నామాన్ని వ్యాఖ్యానిస్తూ భట్టర్, "కృతం హి తేన లక్షణం ఉపాదేయానామ్, "చక్రాంకితాః ప్రవేష్టవ్యాః యావదాగమనం మమ" అని అనడం వల్ల, భగవంతునకు ఇష్టుడైన ప్రపన్నుని లక్షణం సుదర్శన చక్రంచేత అంకితం కావడమే, అదే భగవంతునకు సమ్మతమైనది అని తెలుస్తున్నది. భట్టర్ ఉదాహరించిన ఈ ప్రమాణంల హరివంశంలోనిది. కృష్ణుడు సాళ్వాదులను జయించడం కోసం ద్వారక నుండి బయలుదేరుతూ, ద్వారపాలకులను " నేను తిరిగి వచ్చేవరకు ఎవరు శంఖచక్రముద్రలను ధరించి ఉంటారో, వారినే మన నగరంలోకి, రాజభవనంలోకి అనుమతించండి. ఆ ముద్రలు లేనివారిని లోపలకు రానీయవద్దు" అని అన్నాడట. దీనివల్ల సుదర్శన చక్రధారణం భగవంతునకు ఇష్టమైనదని, అదే ప్రపన్నుని లక్షణమని తెలుస్తున్నది.

సుదర్శన వైభవాన్ని తెలియజేసే ఇటువంటి వైదిక ప్రమాణాలు చాలా ఉన్నప్పటికీ, విస్తరభీతి వల్ల ఇంతటితో విరమింపబడుతున్నది.

### శ్రీ సుదర్శన భగవానుని అవతార వృత్తాంతాలు

శ్రీవిష్ణు పురాణంలో సుదర్శనమూర్తి జన్మవృత్తాంతం ఈ విధంగా తెలియజేయబడింది. సూర్యుని తేజస్సును అతని భార్య అయిన ఛాయాదేవి భరించ లేని కారణంచేత, విశ్వకర్మ సూర్యుని యంత్రంలో సానబట్టి తేజస్సును తగ్గించాడట. అప్పుడు రాలిన పొడితో అతడు సుదర్శన చక్రాన్ని నిర్మించి, దానిని శ్రీమన్నారాయణునకు సమర్పించాడట. ఇది శ్రీవిష్ణు పురాణంలో కనిపించే సుదర్శన భగవానుని అవతారానికి సంబంధించిన వృత్తాంతం.

తేజసః శమనం చాస్య విశ్వకర్మా చకార హ,
భ్రమి మారోప్య సూర్యం తు తస్య తేజోనిశాతనమ్,
హృతవా నష్టమం భాగం న వ్యశాత యదవ్యయమ్,
యత్తస్మాత్ వైష్ణవం తేజః శాతితం విశ్వకర్మణా,
జాజ్వల్యమాన మపతత్ తద్భూమౌ మునిసత్తమ
త్వష్టైవ తేజసా తేన విష్ణోః చక్ర మకల్పయత్"
(శ్రీ విష్ణు పురాణం –3–2–8, 9, 10, 11)

(అప్పుడు విశ్వకర్మ సూర్య భగవానుని తేజస్సును తగ్గించాడు. సూర్యుని సానబట్టే యంత్రంలో పెట్టి, అతని తేజస్సును సానబట్టాడు. అందులో ఎనిమిదవ భాగం తగ్గేటట్టుగా చేశాడు. తరగని సూర్యుని తరిగేటట్లు చేశాడు. సూర్యుని నుండి సానబట్టిన ఆ వైష్ణవ తేజస్సు గొప్పగా జ్వలిస్తూ భూమిపై పడింది. ఆ తేజస్సుతో త్వష్ట శ్రీమహావిష్ణువునకు చక్రాన్ని నిర్మించి ఇచ్చాడు) .

మత్స్య పురాణంలో కూడా ఇటువంటి వృత్తాంతమే గోచరిస్తున్నది. ఆ పురాణంలోని

"అపనేష్యామి తే తేజః యంత్రే కృత్వా దివాకర! ,
రూపం తవ కరిష్యామి లోకానందకరం ప్రభో! ,
తథేత్యుక్త స్తు రవిణా, భ్రమౌ కృత్వా దివాకరమ్,
పృథక్ చకార తత్తేజః చక్రం విష్ణోః ప్రకల్పయత్"

(ప్రభూ! దివాకరా! నీ తేజస్సును యంత్రంలో పెట్టి తగ్గిస్తాను. దానిని లోకానికి ఆనందం కలిగించేటట్లు చేస్తాను– అని విశ్వకర్మ అన్నాడు. దానికి సూర్యుడు ఆ విధంగానే చేయమని అన్నాడు. అప్పుడు విశ్వకర్మ సూర్యుని యంత్రంలో సానబెట్టి, దానివల్ల వచ్చిన తేజస్సుతో సుదర్శన చక్రాన్ని నిర్మించాడు) అనే శ్లోకాలు ఇక్కడ ఉదాహరణీయాలు.

వామన పురాణంలోను, పాద్మోత్తర ఖండంలోను సుదర్శన మూర్తి ఆవిర్భావృత్తాంతం ఇంకొక రీతిలో ప్రస్తావింపబడింది. ఈ పురాణాలలో చెప్పబడిన ప్రకారాన్ని బట్టి, పరమేశ్వరుడు సకల దేవతల తేజస్సుతో తన తేజస్సును కలిపి, దానితో సుదర్శన చక్రాన్ని నిర్మించి భగవంతునకు ఇచ్చినట్లు తెలుస్తున్నది. పాద్మోత్తర పురాణంలోని

ఆథ విష్ణుముఖా దేవా స్వతేజాంసి దధు స్తదా,
తాన్యైక్యం వై గతానీశో దృష్ట్వా స్వం చాముచన్మహః,
తేనాకరోత్ మహాదేవః సహసా శస్త్రముత్తమమ్,
చక్రం సుదర్శన నామ జ్వాలామాలాతిభీషణమ్"
అనే శ్లోకాలు, వామనపురాణంలోని

"తతః ప్రీతః ప్రభుః సాక్షాత్ విష్ణోవే ప్రవరం వరమ్,
ప్రత్యక్షం తైజసం శ్రీమాన్ దివ్య చక్రం సుదర్శనమ్,
త్వమేవ మాదాయ విభో వరాయుధం
చక్రం సురాణాం జహి మా విశంకిథాః
అమోఘ ఏషోమరరాజపూజితో
ధృతో మయా దేహగతః తపోబలాత్"
అనే శ్లోకాలు ఈ విషయాన్ని తెలుపుతున్నాయి.

వైకుంఠంలో ఉండే నిత్యులలో ఒకడుగా కీర్తింపబడే సుదర్శన భగవానుడు జన్మ మరణాలకు, సంసార బంధానికి అతీతుడు. అందువల్ల, ఈ విధంగా పురాణాలలో తెలుపబడిన సుదర్శన మూర్తి అవతారవృత్తాంతాలు అన్ని, భగవంతుని అవతారాలవలె, భగవంతుని సంకల్పం వల్ల సంభవించినవి అని, కృపా మూలకాలు అని తెలియాలి తప్ప, మన వంటి జన్మ సుదర్శన భగవానునకు కూడా కలిగిందని భావించరాదు.

వేరు వేరు పురాణాలలో సుదర్శన భగవానుని అవతార వృత్తాంతాలు వేరువేరుగా కనిపించటానికి కారణం ఏమి? అనే సందేహం కూడా ఇక్కడ కలుగవచ్చు. విభిన్న రీతులలో

గోచరించే ఇటువంటి వృత్తాంతాలకు కల్ప భేదాన్ని బట్టి సమాధానం చెప్పుకోవాలి– అని మన పూర్వాచార్యులు నిర్ణయించి పలికారు. అందువల్ల శ్రీవిష్ణు పురాణ, మత్స్యపురాణ వృత్తాంతానికి, వామన పురాణ పాద్మోత్తరపురాణ వృత్తాంతానికి మధ్య ఎటువంటి విరోధం లేదని తెలియాలి.

## సుదర్శననామ నిరుక్తులు

౧) అమరకోశ వ్యాఖ్యానం అమరసుధలో సుదర్శన శబ్దానికి "శోభనం దర్శనమస్య, సుఖేన దృశ్యతే ఇతి వా" అనే రెండు వ్యుత్పత్తులు తెలుపబడ్డాయి. గురుబాల ప్రబోధిక అనే ఇంకొక వ్యాఖ్యానంలో కూడా ఈ అర్థాలే చెప్పబడ్డాయి. ఈ వివరణాలు రెండు సుదర్శనుని రూపంలోని వైలక్షణ్యాన్ని, మంగళకరత్వాన్ని, సౌలభ్యాన్ని తెలియజేస్తున్నాయి. ఆళ్వార్లు "పొన్ ఆళి, ఉరువార్ శక్కరమ్, పొన్నొడుమ్ శక్కరమ్" అని మొదలైన ప్రయోగాల ద్వారా సుదర్శన భగవానుని రూపంలోని అందాన్ని తెలియజేశారు. సుదర్శనుని బంగారుతో పోల్చడం వల్ల బంగారంవలె ఎర్రని కాంతిని కలిగినవాడని, బంగారం వలె మంగళకరుడు అని, పూజనీయుడని తెలుపబడింది. ఆ విధంగానే, "అరుళార్ శక్కరమ్" (కృపను నిండుగా కలిగిన సుదర్శనం) అని మొదలైన ప్రయోగాల ద్వారా సుదర్శనుని కారుణ్యం, దానివల్ల సౌలభ్యం తెలుపబడింది. ఈ విధమైన వివరణలలో దర్శనం అనేదానికి స్వరూప రూపాలు అనే అర్థం గ్రహింపబడింది. శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం వ్యాఖ్యానంలో శ్రీపరాశర భట్టర్ " సుదర్శనః " అనే నామాన్ని వ్యాఖ్యానిస్తూ, " గుణప్రభావానభిజ్ఞానామపి దర్శన మాత్రమేవాస్య దర్శనం శోభనం ఇతి సుదర్శనః" అని అన్నారు. గుణాలను, ప్రభావాన్ని తెలియ లేనివారికి కూడా ఎవని దర్శనం శుభప్రదంగా, ప్రేమకు హేతువై ఉంటుందో, అతడు సుదర్శనుడు –అని దీని అర్థం. ఈ వివరణ భగవంతుని విషయంలోనే కాక సుదర్శనుని విషయంలో కూడా చక్కగా అన్వయిస్తుంది కదా. సుదర్శన భగవానుని దర్శన మాత్రంతోనే అందరూ ఆ స్వామికి చేతులెత్తి భక్తితో మొక్కుతారు కదా.

౨) అహిర్బుధ్న్యసంహితలో సుదర్శనశబ్దానికి ఇంకొక వ్యుత్పత్తి తెలుపబడింది. " కిం తత్ సుదర్శనం నామ? కశ్చ శబ్దార్థ ఉచ్యతే? " – సుదర్శనమంటే ఏమి? ఈ శబ్దంయొక్క అర్థమేమి? అనే పరమేశ్వరుని ప్రశ్నించగా, అతడు

"తస్య స్యామితి సంకల్పో భావతో ఽ భావతో ఽ పి వా,
స్వాతంత్ర్యాననుయోజ్యేన రూపేణ పరివర్తతే,
యత్తత్ ప్రేక్షణ మిత్యుక్తం దర్శనం తత్ ప్రగీయతే,

వస్తుతః కాలతః దేశాత్ తస్య త్వవ్యాహృతి ర్హి యా,
పూజా సా తు సుశబ్దార్థః సుదర్శన మితీర్యతే"

అని సమాధానాన్ని చెప్పాడు. ఈ సమాధానాన్ని బట్టి చిదచిద్రూపంగా భగవంతుడు పరిణమించడానికి కారణమైన "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" (నేను అనేక విధాలయిన రూపాలను పొందుతాను అని ఆ పరమాత్మ సంకల్పించాడు) అని చెప్పబడిన సంకల్పరూపమైన ఈక్షణమే దర్శన శబ్దార్థమని, దానికి విషయ కాల దేశ పరిమితులు లేకపోవడమే సుశబ్దార్థమని తెలుస్తున్నది. నమ్మాళ్వారులు కూడా తిరువాయ్ మొழி దివ్య ప్రబంధంలో "మழுజ్గాద ఞానమే పడైయాక" (మొక్కపోని సంకల్పరూప జ్ఞానమే ఆయుధంగా) అని అంటూ భగవంతుని సంకల్పాత్మక జ్ఞానాన్ని సాధనంగా, ఆయుధంగా కీర్తించారు. ఈ ఆయుధం ఏ ఆయుధం? అంటే దానికి సమాధానాన్ని పౌరాణిక సూక్తులు తెలుపుతున్నాయని " వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః" (భగవంతుని ప్రేక్షణ రూపమైన సంకల్పమే సుదర్శనాయుధంగా పౌరాణిక సూక్తులు తెలుపుతున్నాయి) అని కూర నారాయణ మునివరులు సుదర్శన శతకంలో అనుగ్రహించారు. ఈ వ్యుత్పత్తిలో "దర్శనం" అనేదానికి వీక్షణం అని అర్థం. "చంద్రసూర్యౌ చ నేత్రే" (సూర్యుడు, చంద్రుడు భగవంతుని కన్నులు) అని కీర్తింపబడిన విధంగా భగవంతుని నేత్రభూతుడైన సూర్యుని వలన ఆవిర్భవించిన సుదర్శనుని ఆ భగవంతుని వీక్షణంగా పలకడం కూడా చాలా యుక్తమే. శ్రీవిష్ణుపురాణంలోని అస్త్రభూషణాధ్యాయంలో మనస్తత్త్వం చక్రాయుధంగా తెలుపబడింది. మనసు వల్లనే కదా సంకల్పం పుడుతుంది, వీక్షణం కూడా సంభవిస్తుంది. ఈ విధంగా కూడా చక్రాయుధం భగవంతుని సంకల్ప రూపంగా పలకడం అర్థవంతంకదా.

3) దర్శనం అనే పదానికి తత్వం అనే ఇంకొక అర్థం కూడా ఉంది. ప్రస్తుతం ఆ అర్థాన్ని గ్రహిస్తే, " శోభనం దర్శనం తత్త్వం యస్య తత్"– మంగళకరమైన, అందమైన తత్వాన్ని కలవాడు, అంటే, స్వభావాన్ని కలవాడు –అనే ఇంకొక వివరణను సుదర్శన శబ్దానికి చెప్పవచ్చు. ఆళ్వారు అనుగ్రహించిన "ఆற்றல் ఆழி (తి. వా. 2–10–5) , "ఆఱు ముయల్ ఆழி" (తి. వా, 5–4–6) అని మొదలైన సూక్తులు "పరిజనత్రాన పండిత "అని మొదలైన ఆచర్య సూక్తులు, పలు పౌరాణిక గాథలు సుదర్శనుని ఆశ్రిత రక్షణ రూపతత్వాన్ని తెలుపుతున్నాయి. ఈ విషయాన్ని ఇక్కడ ఉదాహరించిన దివ్యసూరుల సూక్తులకు పూర్వాచార్యులు చేసిన వ్యాఖ్యానాలను నిరూపిస్తున్నాయికూడా. అందుచేత

ఆశ్రిత రక్షణ మనే అందమైన ఒక పరమ ధర్మాన్ని, , స్వభావాన్ని కలిగినవాడు, ఈ సుదర్శనుడు– అనే అర్థాన్ని కూడా సుదర్శన నామానికి చెప్పవచ్చు.

౪) " శోభనం దర్శనం యస్మాత్, యేన భవతి తత్ సుదర్శనమ్" అని ఇంకొక అర్థాన్ని సుదర్శన శబ్దానికి. గ్రహించినట్లయితే, చక్కని తత్త్వజ్ఞానం, అంటే, స్వరూప దర్శనం ఎవరి వల్ల కలుగుతుందో, అతడు సుదర్శనుడని అర్థం వస్తుంది. "ఎప్పోదుమ్ కైకழలా నేమియాన్" (ఎల్లప్పుడూ తన చేతిని విడవకుండా ఉండే సుదర్శనాన్ని కలిగినవాడు) (పెరియ తిరువందాది) అని నమ్మాళ్వారులు పలికినట్లుగా, భగవంతుని హస్తాన్ని ఒక్క క్షణం కూడా విడవకుండా వెంటనే ఉండి, ఆ స్వామి మనసును తెలిసి, దానికి అనుగుణంగా వర్తించి సేవించే స్వభావం కలిగినవాడు, తన సేవలతో భగవంతుని మనస్సును సంతోష పెట్టేవాడు, ఈ సుదర్శనుడు కనుక, శోభనమైన స్వరూపానికి ప్రతీక అవుతున్నాడు. అందువల్ల ఆ సుదర్శనుని దర్శించడం వల్ల భక్తులకు స్వరూప జ్ఞానం కలుగుతుంది. మనకు కూడా "ఈ సుదర్శనుని ఎల్లప్పుడూ భగవంతుని వెంటనే ఆ స్వామికి తగిన సేవలను చేసి ఆయన మనసును సంతోష పెట్టడం మన స్వరూపం "అనే జ్ఞానం సుదర్శనుని చూసినప్పుడు కలుగుతుంది. ఈ అర్థంలో కూడా సుదర్శనశబ్దం సార్థకమవుతుంది పై వివరణలలో రెండిటిలోను కూడా, దర్శన శబ్దానికి తత్త్వమనే అర్థం. కానీ, ముందు వివరణలో దర్శనమనేదానికి ఆశ్రిత రక్షణ రూప తత్త్వం అనే అర్థం చెప్పబడగా, , ఇందులో జీవుని స్వరూపమైన అనన్యార్హశేషత్వ, అనన్య శరణత్వ, అనన్య భోగ్యత్వాలు అనే అర్థం గ్రహింపబడడం గమనించాలి.

౫) " సు సమ్యక్ దర్శనం భగవతః యేన, యస్మాత్ తత్ సుదర్శనమ్" అనే ఇంకొక వివరణాన్ని గ్రహిస్తే, భగవంతుని దర్శనం చక్కగా ఎవరి వల్ల కలుగుతుందో, అతడు సుదర్శనుడనే అర్థం వస్తుంది. ఈ అర్థానికి అనుగుణంగా, పెరియ తిరుమొழி ప్రబంధంలోని ", మైయిలంగు కరుమ్ కువళై––––– నెయ్యిలంగు శుడరాழி" (3–6–10) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ పరమ కారుణికులైన పెరియ వాచ్చాన్ పిళ్ళై సరసంగా చేసిన వివరణ ఇక్కడ స్మరించదగినది. తిరువాలి అనే దివ్యదేశంలో ఉండే స్వామిని విశ్లేషించిన పరకాల నాయకి ఆ స్వామిని సేవించాలని వచ్చినప్పుడు, ఆ భగవానుని దేహం నీల వర్ణాన్ని కలిగినది, నల్ల కలువల మాలను ఆ స్వామి అలంకరించుకున్నాడు కనుక, ఆ స్వామి ఉండే కోవెలలో అంతటా చీకటి వ్యాపించి ఉన్నది కనుక, ఆ స్వామి చేతిలో గొప్పగా వెలిగే చక్రాయుధమే లేకపోయినట్లయితే ముందడుగు ఎక్కడ వేయాలో తెలియని

స్థితి పరకాల నాయకికి కలిగి ఉంటుంది" అని అక్కడ ఆ ఆచార్యులు వివరిస్తారు. ఇందువల్ల నల్లని వర్ణాన్ని కలిగిన భగవంతుని సేవించాలంటే, ఆయన చేతిలో ఉండే గొప్పగా ప్రకాశించే సుదర్శనం తప్పక ఉండాలి. లేకపోతే ఆయన దర్శనం కలుగదు, కలిగినా స్పష్టంగా కలుగదు కనుక, భగవంతుని దర్శనం ఎర్రగా ప్రకాశించే చక్రాయుధం వల్ల వల్ల కలుగుతున్నది కనుక సుదర్శనం అనే పేరు సార్థకమవుతున్నది– అని ఇక్కడ తాత్పర్యం.

ఉ) " భగవతః ఆనందాతిశయస్య దర్శనం అస్మాత్ సువ్యక్తో భవతి ఇతి సుదర్శనమ్" అనే ఇంకొక వివరణ కూడా సుదర్శన నామానికి గ్రహించవచ్చు. భగవంతునకు కలిగిన గొప్ప ఆనందం ఎవరి ద్వారా వ్యక్తమవుతుందో, అతడు సుదర్శనుడు –<అని దీని అర్థం. ఈ వివరణానికి అనుకూలంగా తిరుప్పావై ప్రబంధంలోని నాలుగవ పాశురంలో కల "పఱ్బనాబన్ కైయిల్ ఆழిపోల్ మిన్ని" (పద్మనాభుని కుడిచేతిలో ఉండే చక్రాయుధం వలె మెరసి) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ పూర్వాచార్యులు చేసిన వివరణాన్ని ఇక్కడ స్మరించాలి.

సృష్టి ఆరంభ కాలంలో పద్మనాభ స్వామి నాభీకమలంనుండి బ్రహ్మ ఆవిర్భవించాడు. తనకు మొట్టమొదటగా పుత్రోత్పత్తి కలిగినప్పుడు ఆ స్వామికి మనసులో ఎంతో సంతోషం కలగడం సహజం. అయినా, అతడు ప్రభువు కనుక, గంభీరమైన మనసును కలిగి ఉంటాడు. సామాన్య వ్యక్తులు వ్యక్తం చేసినట్లుగా తన సంతోషాన్ని తాను వ్యక్తం చేయడు. లోకంలో ఒక ప్రభువు, తనకు పుత్రుడు కలిగినప్పుడు, తనకు కలిగిన సంతోషాన్ని తన సేవకుల ద్వారా ఉత్సవాలను జరిపించి వ్యక్తం చేయడం లోకంలో అంతటా కనిపించే విషయమే. ఆ విధంగానే ఇక్కడ సర్వస్వామి అయిన భగవానుడు కూడా, తనకు బ్రహ్మ పుత్రుడుగా జన్మించినప్పుడు కలిగిన సంతోషాన్ని తనకు ఇష్ట సేవకుడైన సుదర్శనుని ద్వారా వ్యక్తం చేశాడట. అందువల్లనే ఆ పద్మనాభ స్వామి చేతిలోని సుదర్శనం విశేషంగా మెరుస్తున్నది– అని మన పూర్వాచార్యులు అంటారు. ఈ విధంగా భగవంతుని ఆనందాతిశయం సుదర్శన ద్వారా వ్యక్తం అవుతున్నది కనుక, దానికి ఆ పేరు సార్థకమైనది అని చెప్పవచ్చు కదా.

ఇటువంటి వివరణమే ఇంకొకటి తిరువాయ్ మొழி ఈడు వ్యాఖ్యానంలో కూడా కనిపిస్తుంది. "అముదమ్ అమర్రర్ కట్కీన్ద నిమిర్ శుడరాழி" (1–6–5) అనే ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై అనే పూర్వాచార్యులు దేవతల ప్రయోజనాన్ని పూర్తిచేసినందు వల్ల భగవంతునకు కలిగిన ఆనందం సుదర్శనం ద్వారా వ్యక్తం అయినట్లుగా ఉన్నది– అని అన్నారు. దీని తాత్పర్యం ఏమంటే, పూర్వం అమృతాన్ని సాధించమని తమకు ఇమ్మని

దేవతలు చేసిన ప్రార్ధనను సఫలీకృతం చేసినప్పుడు భగవంతునకు మనస్సులో చాలా ఆనందం కలిగింది. వారు కోరినట్లుగా వారికి అమృతాన్ని ఇవ్వగలిగాను కదా! అనే గొప్ప ఆనందం భగవంతునకు కలిగింది. ఆ ఆనందాన్ని అతడు తన చేతిలో ఉండే సుదర్శనుని ద్వారా వ్యక్తం చేశాడు. అందువల్లనే ఆ సుదర్శన చక్రం "ఝడరాళి" అనే విధంగా అంతగా మెరుస్తున్నది– అని ఇక్కడ తాత్పర్యం.

ఈ వివరణ కొంచెం దూరాన్వయాన్ని కలిగినది అయినా, అర్థస్వారస్యాన్నిబట్టి చేయబడిందని గ్రహించాలి. ఇటువంటి సరసమైన సుదర్శన నామ నిర్వచనాలను ఇంకా పెద్దల ద్వారా గ్రహించాలి.

★★★★★

# 8. శ్రీకృష్ణానుస్మరణమే గొప్ప ప్రాయశ్చిత్తం

మనకు తెలిసో, తెలియకో, కొన్ని కొన్ని సమయాలలో కొన్ని తప్పులను చేస్తూ ఉంటాము. ఇది అందరి విషయంలోనూ సహజమైన విషయం. శాస్త్రాలలో "ఈ విధాలయిన తప్పులకు ఈ విధాలైన ప్రాయశ్చితాలు చేయబడాలి" అని తెలుపబడింది. అయితే, ఏ తప్పుకు ఏ విధమైన ప్రాయశ్చిత్తం, ఎక్కడ విధింపబడింది? అని తెలియాలి. తెలిసినా, దానిని అర్థం తెలుసుకోగలగాలి. అర్థమైనా, దానిని ఆచరించగలగాలి ఆచరించగలిగినా, ఏ తప్పు లేకుండా, ఏ పొరపాటు లేకుండా ఆచరించగలగాలి. ఇన్ని కష్టాలు ఉన్నాయి. అన్నీ సందేహానికి, భయానికి అవకాశాన్ని కలిగించేవిగా ఉన్నాయి. అయినప్పటికీ, మనం శాస్త్రాలలో విధింపబడిన ప్రాయశ్చితాలను చేస్తున్నాము, చేయాలి కూడా.

ఆ విధంగా చేసిన ప్రాయశ్చితాలు మంచి ఫలితాలను ఇవ్వడం కోసం, ఇంకా మనకు తెలియకుండా చేసిన తప్పులకు మనం ప్రాయశ్చిత్తం చేయకుండా ఉన్నట్లయితే, ఆ దోషాలను పోగొట్టుకోవడం కోసం ఒకటే గొప్ప ప్రాయశ్చిత్తం ఉన్నది. అది శ్రీకృష్ణానుస్మరణం, శ్రీకృష్ణ నామానస్మరణమే.

భగవంతుని గూర్చిన స్మరణే ఒక గొప్ప ప్రాయశ్చిత్తం, ఇది అన్ని ప్రాయశ్చితాల కంటే గొప్పది అని పురాణాలు తెలుపుతున్నాయి. "ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకాని వై, యాని తేషా మశేషాణాం శ్రీకృష్ణానుస్మరణం పరమ్" అనే పౌరాణిక శ్లోకం ఈ విషయాన్ని తెలుపుతున్నది. ఎన్నో ప్రాయశ్చిత్త కర్మలు శాస్త్రాలలో ఉన్నాయి. ఉపవాసం చేయడం, దాన ధర్మాలు చేయడం తపస్సును చేయడం, మౌనవ్రతాన్ని పాటించడం, తీర్థయాత్రలు చేయడం అని ఈ విధంగా ఎన్నో ఉన్నాయి. ఈ విధంగా ఉండే అశేషమైన ప్రాయశ్చిత్త కర్మల కంటే, శ్రీ కృష్ణానుస్మరణమే గొప్ప ప్రాయశ్చిత్తం. ఇది అన్ని ప్రాయశ్చితాల కంటే సులభమైనది, తప్పక ఫలాన్ని ఇచ్చేది కూడా.

కృష్ణానుస్మరణం అంటే ఏమి? శ్రీకృష్ణుని గూర్చి చింతించడం, నిరంతరంగా చింతించడం. అనుధ్యానం, అనుస్మరణం అని అంటే, ఒకసారి భగవంతుని గూర్చి కలిగిన స్మరణ మనసులో నుండి అదృశ్యమై పోవడానికి ముందే మళ్లీ అది ఏర్పడడం. ఈ విధంగా ఒకదాని వెంట ఒకటి, ఒకదాని వెంట ఒకటిగా స్మరణ పరంపర ధ్యనపరంపర కలిగితే,

దానికి అను ధ్యానం, అనుస్మరణం అని పేరు. అను అంటే అనుసరించి అని అర్థం. ఒక భావనను అనుసరించి వేరొక భావన కలగడమే అనుధ్యానం, అనుస్మరణం.

ఇక్కడ "అను" అనే పదానికి వేరొక అర్థం కూడా ఉన్నది. నాయకుడు ఒకడు ముందు నడుస్తున్నాడు, అతనిని అనుసరించి అతని సేవకులు నడుస్తున్నారు అనుకోండి. గురువు ముందు నడుస్తున్నాడు, శిష్యుడు అతని వెనకాల నడుస్తున్నాడు అనుకోండి. దీనికి అనుగమనం అని పేరు. ముందు వెళ్లే ప్రభువును అతని సేవకులు కానీ, ముందు వెళ్లే గురువును అతని శిష్యుడు కానీ, ఏ భావనతో అనుసరిస్తారు? మేము ఈ ప్రభువుకు సేవకులం. అతని కంటే తక్కువవారం. మేము ఈ ఆచార్యునకు శిష్యులం, దాసులం, అన్ని విధాల తక్కువ వారం అనే భావనతో గదా అనుసరిస్తారు. ఈ విధమైన రీతిలో "శ్రీకృష్ణునకు నేను దాసుడను ", అనే భావనతో ధ్యానం చేయడం కూడా శ్రీకృష్ణానుస్మరణం అవుతుంది. అందువల్ల ఈ విధమైన అనుస్మరణలో "భగవంతుడు శేషి, నేను ఆయనకు శేషమై ఉండేవాడను ", అనే భావన ఉంటుంది. ఇటువంటి భావన, అనవరతమైన భావన తప్పక మన దోషాలను అన్నిటినీ పోగొట్టే ప్రాయశ్చిత్తం అవుతుంది.

సరే, ఆ పరమాత్మ చాలా గొప్పవాడు. నా దగ్గర చాలా దోషాలు ఉన్నాయి నా దోషాలను అతడే పోగొట్టాలి. అందువల్ల నేను ఆ స్వామిని నిరంతరంగా ధ్యానిస్తున్నాను. నా ధ్యానం కూడా నిరంతరంగా ఎడతెగకుండా చేయాలి– అనే భావనతో నేను భగవంతుని స్మరిస్తున్నానని అనుకోండి. అయితే, నేను ఈ విధంగా ఎంతసేపు స్మరించగలను? ఐదు నిమిషాల పాటా? పది నిమిషాల పాటా? అరగంటా.? భగవంతుని ధ్యానించాలని ప్రయత్నించగానే ఎన్నెన్నో అక్కరలేని విషయాలు మన మనసులోకి వెను వెంటనే నిరంతరంగా వస్తాయే! ఏ విధంగా భగవంతుని ధ్యానం చేయడం? అనుస్మరణ చేయడం? అనే సందేహం మనకు కలుగవచ్చు. వాస్తవానికి ఈ సందేహం సరికాదు. మనం లౌకిక జీవనంలో ఎన్నెన్నో విషయాలను గంటల తరబడి చూస్తున్నాము. కానీ, భగవానుని ధ్యానం, అనుస్మరణం అనే మాట దగ్గరకు వచ్చేటప్పటికి మాత్రం, అది సాధ్యం కాదని అంటున్నాము. భగవంతుని ధ్యానించాలని, స్మరించాలని కూర్చుంటే చాలు, ఆటంకం వస్తున్నదే! 10 నిమిషాలకు మించి భగవంతుని ధ్యానించడం సాధ్యం కాకుండా ఉన్నదే! అని అంటాము. ఇది నిజానికి మనం మనలను మోసం చేసుకోవడం తప్ప వేరొకటి ఏమీ లేదు. ఎందుకంటే, మనం లౌకిక విషయాలను ఎన్నిటినో, ఏదో కొద్దిసేపు చూద్దాం –<అని ఆరంభించి, గంటల తరబడి అదే విషయాన్ని ఎంతో ఆసక్తితో చూచి కాలాన్ని

గడుపుతున్నాము. 10 నిమిషాలు అని ఆరంభించి, గంటల తరబడి ఆ విషయాలను చూసి కాలాన్ని గడుపుతున్నాము. ఎన్నో ఆవశ్యకాలైన పనులు ఉన్నప్పటికీ, వాటిని వదిలిపెట్టి, ఆ విషయాలనే గమనిస్తాము. ఒక్కొక్కసారి మనం చూసే విషయానికి, మనకు. మధ్య ఏ విధమైన సంబంధం కూడా ఉండకపోవచ్చు. చూడడం వల్ల ఏ విధమైన ప్రయోజనంకూడా లేకపోవచ్చు. అయినప్పటికీ, వాటిని గంటల తరబడి గమనిస్తాము. కాలాన్ని గడుపుతాము. లోకంలో ఎవరూ కూడా రాజకీయ విషయాల గురించి కానీ, వేరు లౌకిక విషయాలను గురించి గానీ, ఆలోచించడానికి, ధ్యానించడానికి సాధ్యం కావడం లేదని చెప్పడం లేదే! వాటిని చూడకపోయినా, ఆలోచించకపోయినా, వచ్చిన హాని ఏమీ లేదు కానీ, వాటిని మనం ఎంతో శ్రద్ధగా, ఆసక్తిగా చూస్తాము, ఆలోచిస్తాము. కానీ, భగవంతుని గూర్చి ధ్యానించవలసిన ఆవశ్యకత మనకు ఉన్నది. కానీ దానిని ధ్యానించము, దానిని గూర్చి ఆలోచించము. ఆ విషయంలో మాత్రమే "సాధ్యం కావడం లేదు", అని అంటాము. అంటే, దీని అర్థం ఏమి? మనలను మనం మోసం చేసుకోవడం తప్ప వేరొకటి ఏమీ కాదు కదా. అందువల్ల మనం ప్రయత్నం చేస్తే, ఎంతో కొంత వీలవుతుంది, సాధ్యం అవుతుంది.

అందువల్ల ఇటువంటి శ్రీకృష్ణానుస్మరణం అనే ప్రాయశ్చితాన్ని తప్పక చేయాలి. "ఆ భగవానుని స్మరణం, అనుధ్యానం నా దోషాలను అన్నిటినీ పోగొడుతుంది", అనే నమ్మకంతో చేయాలి. "ఇది తప్ప వేరొక గది ఏదీ లేదు" అనే నమ్మకంతో చేయాలి. ఇటువంటి నిశ్చయం మన మనసులో ఏర్పడితే, తప్పక మనం భగవంతుని అనుస్మరణను చేయగలము, సందేహం లేదు. ఈ సమయాలలో, ఈ కార్యాలలో ఏ ఏ ప్రాయశ్చితాన్ని చేయాలి? అని ఆలోచించడం కంటే, భగవంతుని నామాన్ని అనుసంధానం చేస్తే సరిపోతుంది. అదే గొప్ప ప్రాయశ్చిత్తం అవుతుంది. ఆ స్వామి తిరునామాలను, రూపాన్ని, కల్యాణ గుణాలను, దివ్య లీలలను అనుస్మరించడం అనే ఎన్నో దారులు ఉన్నాయి.

అందుచేత, మిగిలిన అన్ని ప్రాయశ్చితాల కంటే, శ్రీకృష్ణానుస్మరణం అనేది సులభమైన, తప్పక ఫలాన్ని ఇచ్చే ప్రాయశ్చిత్తం. దానిని మనం తప్పక చేద్దాం. రండి. స్వస్తి.



# 9. మన పేర్లు సార్థకం కావడం ఎలా?

భగవంతునకు అనేక నామాలు ఉన్నాయి. ఆ భగవంతుని నామాలనే మనకు పేర్లుగా పెట్టుకుంటున్నాము. లక్ష్మీదేవి నామాలను ఆడవారికి, భగవంతుని నామాలను మగవారికి పెట్టుకోవడం లోకంలో సహజంగా కనిపించే విషయం. ఇందులో మనకు ఒక తీయని సందేహం కలుగవచ్చు.

భగవంతునికి కల నామాలు అన్నీ గుణాలను, స్వరూపాన్ని, రూపాన్ని, లీలలను ఆధారంగా చేసుకుని వచ్చినవి. అవి రూఢినామాలు కావచ్చు, లేదా, యోగ నామాలు కావచ్చు. యోగరూఢి నామాలు కావచ్చు. ఈ లీలను చేశాడు కాబట్టి, ఈ పేరును కలిగి ఉన్నాడు, ఈ గుణాన్ని కలిగిన వాడు కనుక ఈ పేరును కలిగి ఉన్నాడు, ఈ విధంగా ఉన్నాడు కనుక ఈ పేరును కలిగి ఉన్నాడు – అనే విధంగా భగవంతుని నామాలు ఏర్పడి ఉంటాయి. "యాని నామాని గౌణాని" అనే శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర పూర్వ పీఠికలోని శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీ పరాశరభట్టర్ గౌణ శబ్దాన్ని వివరించేటప్పుడు, భగవంతుని గుణాలను, లీలలను ఆధారంగా చేసికుని వచ్చినవి, భగవంతుని నామాలు అని వివరించారు. గోవులను కాపాడాడు కనుక గోవిందుడు అని, లక్ష్మికి నాథుడు కనుక మాధవుడని, అంతటా వ్యాపించి ఉన్నాడు కనుక విష్ణువు అని, అందమైన కేశపాశాన్ని కలిగినవాడు కనుక కేశవుడని, ఈ విధంగా భగవంతుని నామాలు అన్ని ఏదో ఒక కారణం చేత ఏర్పడిన నామాలు కనుక, సార్థకమైనవి. అందువల్ల ఈ నామాలు ఆ భగవంతునకు అన్ని విధాలుగా సరిపోతాయి. కానీ, మనం ఆ భగవంతుని నామాలను పెట్టుకుంటే, అవి మనకు ఏ విధంగా సరిపోతాయి? సార్థకం అవుతాయి? భగవంతుడు చేసిన లీలలను మనం చేయలేదే! ఆయనకు కల గుణాలు మనకు లేవే! ఆయన స్వరూపం వంటిది కాదే, మన స్వరూపం! . విష్ణువు అని మనం పేరు పెట్టుకుంటే, మనం అంతటా వ్యాపించి ఉండేవారం కాదు కదా. గోవులను కాపాడని మనకు గోపాలుడనే పేరు ఏ విధంగా సరిపోతుంది? అయితే, మరి, మన పేర్లు అన్ని అర్థం లేనివేనా? వాటికి అర్థమే లేదా? ప్రయోజనమే లేదా? ఏదో ఒక గుర్తు కోసమే మనం పెట్టుకుంటున్నామా? అంత మాత్రం ప్రయోజనమేనా, మన పేర్లకు ఉన్నది! అని ఈ విధంగా ఒక సందేహం మన మనసులో కలుగుతుంది.

కానీ, వాస్తవం అది కాదు. మనం భగవంతుని పేర్లను పెట్టుకోవడంలో ఒక గంభీరమైన అర్థం ఉన్నది. ఒకరికి మనం దాసులం అయితే, ఆయనే మనకు సర్వస్వం అని భావిస్తే, ఆ వ్యక్తి విషయంగా కొన్ని కార్యాలను లోకంలో మనం చేయడం సహజం. ఆ వ్యక్తి

చిత్రపటాన్ని మన ఇంటిలో పెట్టుకుంటాము. దానికి పూజను చేస్తాము. ఆ వ్యక్తి పేరును మన ఒంటిపై వ్రాయించుకుంటాము. ఇంతే కాక, ఆ వ్యక్తి పేరును కూడా పెట్టుకుంటాము. ఈ విధంగా పెట్టుకోవడంలో ఉద్దేశం ఏమంటే, ఆ వ్యక్తికి మనం శేషమై ఉన్నాము అని తెలియజెప్పడం కోసమే. భగవంతుని చిత్రపటాన్ని, విగ్రహాలను మనం ఇంటిలో పెట్టుకుంటున్నాము. వాటికి పూజలను చేస్తున్నాము. ఈ పనులన్నీ ఆ స్వామికి మనం దాసులం అనే ఉద్దేశంతోనే చేస్తున్నాం. అటువంటి ప్రకారాలలో ఒకటి, భగవంతుని నామాలను మనం పెట్టుకోవడం అనేది. అందువల్ల మనం భగవంతుని నామాలను పెట్టుకోవడం వల్ల ఏ విధమైన ప్రయోజనం లేదు –అని భావించకూడదు. భగవంతుని పేర్లను మనం పెట్టుకుంటే, మనం ఆ స్వామికి దాసులం –అనే విషయాన్ని మనం వ్యక్తం చేస్తున్నామన్నమాట.

అయితే, బాహ్యంగా కేవలం పేరును పెట్టుకున్నంత మాత్రంతో చాలదుకదా. భగవంతునకు మనం దాసులం–< అనే విషయాన్ని తెలుపడం కోసం ఆయన పేరును పెట్టుకోవడంతో పాటు, ఆ భావానికి తగినట్లుగా మనం నడుచుకోవాలి కదా. గోవిందుడు అనే పేరు పెట్టుకుంటే చాలునా? ఆ స్వామికి దాసుడై ఉన్నప్పుడు కదా, ఆ నామానికి సార్థకత కలుగుతుంది. గోపాలుడు అనే పేరు పెట్టుకుంటే చాలునా? ఆ స్వామికి దాసుడై, ఆ స్వామికి ఇష్టమైన రీతిలో ప్రవర్తించినప్పుడు కదా, ఆ నామానికి సార్థకత కలుగుతుంది. గోపాలుడనే పేరు పెట్టుకున్నప్పుడు, భగవంతుడు గోవులను కాచినట్టుగా మనం గోవులను కాచలేకపోవచ్చు, కానీ, ఆ స్వామికి దాసునిగా ఉండవచ్చు కదా. అది సాధ్యమే కదా. శ్రీనివాసుడు అనే పేరు పెట్టుకుంటే, సాక్షాత్తు శ్రీనివాసుడిగా అయ్యే అవకాశం లేకపోవచ్చు కానీ, ఆ స్వామికి దాసుడై ఉండే అవకాశం ఉన్నది కదా. ఆ విధంగా ఉండడం కోసమే మనం భగవంతుని నామాలను పెట్టుకుంటున్నాము. ఆ విధంగా కాకుండా, ఆయనకు సంతోషం కలిగించే విధంగా వర్తించకుండా ఉంటే, అప్పుడు మన పేర్లు అర్థం లేనివే అవుతాయి. మనం పెట్టుకున్న పేరు సార్థకం కావాలి అంటే, మనం ఎవరి పేరును పెట్టుకుంటామో, ఆ స్వామికి మనం దాసులమై, అతనికి అభిమతమైన రీతిలో వర్తించాలి. ఆశతో, ఆదరంతో భగవంతునకు సేవలను చేయాలి. ఇదే మన పేర్లలో ఉండే తత్త్వం.

అందువల్ల భగవంతునకు శేషభూతులమై, ఆ స్వామికి మన స్వరూపానికి అనుగుణమైన సేవలను చేసి, మన పేర్లను సార్థకం చేసుకుందాం, రండి.



## 10. మంచి మాటను చెబుతాను, వినండి.

ప్రతి దినం మనం శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రాన్ని పారాయణ చేస్తాం. మన భారతదేశంలో అనే కాకుండా, ప్రపంచంలో అంతటా కూడా ఎంతోమంది ఈ స్తోత్రాన్ని పారాయణం చేస్తున్నారు. ఆ స్తోత్రానికి కల పూర్వపీఠికలో ఒక శ్లోకం ఈ విధంగా ఉన్నది.

"తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే! ,
విష్ణోః నామసహస్రం మే శ్రుణు పాపభయాపహమ్"

భీష్మాచార్యులు అంపశయ్యపై పరుండి ఉండి, ధర్మపుత్రునకు శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రాన్ని ఉపదేశిస్తూ ఈ మాటను చెప్పాడు. లోకానికి ప్రధానుడు, అంటే, శేషి, లోకానికి అంతటికీ ప్రభువు విష్ణువు. ఆ స్వామి లోకంలో అంతటా వ్యాపించి ఉన్నాడు. అటువంటి ఆ భగవానుని నామసహస్రాన్ని నా నుండి విను – అని ఈ శ్లోకంలో ధర్మరాజుకు చెబుతున్నాడు.

ధర్మరాజు భీష్మునకు ఎదురుగానే ఉన్నాడు. అయినప్పటికీ, ఎదురుగా ఉండే ధర్మరాజును చూసి "శ్రుణు – నేను చెప్పే మాటను విను" అని ఎందుకు చెప్పడం? ఎదురుగా ఉండే వ్యక్తిని వినమని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు కదా. ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు కదా భీష్ముడు సమాధానాన్ని చెబుతున్నాడు. ధర్మరాజు భీష్ముని వచనాలను శ్రద్ధగా వింటూనే ఉన్నాడు. ఇక్కడ ఈ విధంగా భీష్ముడు అనడంలో ఏమి తాత్పర్యం? అనేది మనం గమనించాలి.

తాను చెప్పే మాటను తప్పకుండా వినాలి, ఆ మాటను విన్న దానివల్ల కలిగే ఫలం చాలా గొప్పది– అనే ఉద్దేశంతోనే భీష్ముడు ఈ విధంగా "శ్రుణు" అని అన్నాడు. గోదాదేవి కూడా, ఈ విధంగానే, తిరుప్పావై ప్రబంధంలో పలికింది. ఆ ప్రబంధంలోని రెండవ పాశురంలో " వైయత్తు వాழ்వీర్ గాళ్! నాముమ్ నమ్ పావైక్కు శెయ్యుమ్ కిరిశైకళ్ కేళీరో!" (ఈ భూమిలో ఉజ్జీవించేవారలారా! మనం చేసే ఈ వ్రతానికి చేసే కృత్యాల వివరాన్ని వినండి) అని అన్నది. అక్కడ గోపికలు అందరూ తనకు ఎదురుగానే ఉన్నప్పటికీ, "వినండి" అని గోదాదేవి ప్రత్యేకంగా నొక్కి పలుకుతున్నది. దానికి కారణం ఏమంటే, తాను చెప్పే విషయాలు తప్పక వినవలసినవి అనే అర్థంతోనే. లేకపోతేగోదాదేవి చెప్పే మాటలను వినాలని వచ్చిన గోపికలను ఉద్దేశించి ప్రత్యేకించి "వినండి ", అని చెప్పవలసిన అక్కరలేదు కదా. అందువల్ల, చాలా శ్రద్ధగా వినాలి –అని సూచించడమే ఇక్కడ ఉద్దేశ్యం. ఈ

విషయంలో గోదాదేవి సర్వేశ్వరుడు సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుని కూడా విడచిపెట్టలేదు. 26వ పాశురంలో "వేండువన కేట్టియేల్" (మాకు కావలసిన వస్తువులను గూర్చి చెబుతాను, నీవు విన్నట్లయితే) అని ఈ విధంగానే అన్నది. అందువల్ల ఈ విధంగా ఎదుటివారిని ఉద్దేశించి తాను చెప్పే మాటలను విను –అని ప్రత్యేకంగా చెప్పడం ఎందుకంటే, తాను పలికే విషయంలోని గౌరవాన్ని సూచించడం కోసం.

శ్రీరామాయణం ఆరంభంలో కూడా ఇటువంటి సన్నివేశాన్నే మనం చూస్తాం. వాల్మీకి మహర్షి అడిగిన ప్రశ్నలకు సమాధానాన్ని చెప్పే నారదుడు "మునే! వక్ష్యామ్యహం, తైర్యుక్తః శ్రూయతాం" (మహర్షీ! నీవు అడిగిన అన్ని గుణాలు ఎవరిలో ఉన్నాయో, ఆ వ్యక్తిని గూర్చి చెబుతాను, విను " అని అన్నాడు కదా.

ఇక్కడ భీష్మాచార్యులు పలికిన మాటలలో "మే" అనే పదం ఒకటి ఉన్నది. ఈ పదానికి "నా నుండి ", అని సామాన్యంగా అర్థాన్ని గ్రహించవచ్చు. కానీ, ఇంతకంటే విశేషమైన అర్థం ఏమంటే, ఈ పదాన్ని చతుర్థీ విభక్తిలోని రూపంగా గ్రహించి, " నాకోసం విను" అనే అర్థాన్ని గ్రహించడంలో ఒక అర్థస్వారస్యం ఉన్నది. ఒక మంచి విషయాన్ని మనం ఒకరికి చెబుతున్నామనుకోండి. మనం దానిని చెప్పేటప్పుడు, ఎదురుగా ఉండేవాడు వింటూనే ఉంటాడు. ఆ విధంగా వినేవానికి ఒక ప్రయోజనం కలిగేటట్లుగా ఒక మంచి మాటను చెప్పేవానికి కూడా ఒక ప్రయోజనం కలుగుతుంది. "ఒక మంచి మాటను ఇతనికి చెప్పాము కదా", అనే ఆనందం చెప్పేవాని మనసులో కలుగుతుంది. అందువల్లనే శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో "కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ" (నా స్వరూపరూప గుణాలను గూర్చి చెప్పేవారు ఆనందిస్తారు, వానిని వినేవారు కూడా ఆనందిస్తారు) అని అన్నాడు. అందుచేత, మంచి మాటను వినేవానికే కాకుండా, ఆ చెప్పేవానికి కూడా మనసులో తృప్తి కలుగుతుంది. " నీవు ఈ మంచి మాటను వింటే, నాకు కూడా లాభమే కదా! వింటావా? " అని ఇక్కడ ", మే" అనే పదంలోని తాత్పర్యం. ఎవరైనా చక్కెర పొంగలిని ముందు పెట్టి, "బాబూ! ఈ చక్కెర పొంగలిని తిను, నీ కాళ్ళను పట్టుకుంటాను" అని బ్రతిమలాడుతూ అంటాడా? మధురమైన చక్కెర పొంగలి అనగానే, వెంటనే ఆధారంతో గ్రహించి స్వీకరించాలి కదా. అటువంటి, అత్యంత మధురమైన, నేను చెప్పే ఈ మాటను ధర్మపుత్రా! నీవు శ్రద్ధగా విను –అని భీష్మాచార్యుడు అంటున్నాడు.

"మరి, నేను చెప్పే మాట వల్ల కలిగే ప్రయోజనం ఏమి? అని అంటావా! నేను నీకు ఉపదేశించబోయే శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రం పాప భయాపహం అయినది. " అని

అంటున్నాడు భీష్మాచార్యుడు. శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రంలోని వేయి నామాలు భయాన్ని పోగొడతాయి, అంతేకాదు, భయానికి కారణం అయిన పాపాలను కూడా లేకుండా చేస్తాయి– అని భీష్మ ఆచార్యుడు అంటున్నాడు పాపాలు భయానికి కారణాలు. ఆ కారణాల వల్ల ఏర్పడే కార్యాలు భయాలు భగవాన్నామాలను అనుసంధానం చేస్తే, "వనే రణే శత్రుజలాగ్ని మధ్యే యదృచ్ఛయాపత్సు మహాభయేషు, ఇదం పఠన్ స్తోత్ర మనాకులాత్మా సుఖీ భవేత్". అని చెప్పిన విధంగా అది పంచాయిధ స్తోత్రమైనా కావచ్చు, శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమైనా కావచ్చు, భగవంతునకు సంబంధించిన ఏ స్తోత్రాన్ని చెప్పినప్పటికీ, అరణ్యాలు, విషం, క్రూర జంతువులు మొదలైనవాటి వల్ల ఏ ఏ భయాలు కలుగుతాయో, ఆ భయాలు అన్నీ తీరిపోతాయి. అందువల్లనే ప్రతి దినం మనం సహస్రనామాన్ని అనుసంధానం చేస్తున్నాము. ఈ విధంగా భగవాన్ నామాలను అనుసంధించడం వల్ల మనకు బయట ఏర్పడి భయం తీరుతుంది. మనసు లోపల కలిగే భయం కూడా తీరుతుంది భయానికి కారణమైన, అనాదికాలంగా మనం వెంటబెట్టుకుని ఉండే పాపాలు కూడా తీరిపోతాయి. భగవన్నామాలను చెప్పినా, చెప్పమని ఎవరినైనా ప్రోత్సహించినా, చెప్పినప్పుడు విన్నా, వాటిని గూర్చి స్మరించినా, ఏమి చేసినప్పటికీ తప్పక మంచి ఫలం కలుగుతుంది. ఏనాడు నిష్ఫలం కావు. ఈ నామాలు భగవంతుని సంబంధించినవి అయినందున, భగవంతునకు సంబంధించినవి ఏమి చెప్పినప్పటికీ అది మనకు మంచినే కలుగజేస్తుంది. భగవంతుడు మనకి దూరంగా ఉన్నప్పటికీ, భగవాన్నామాలు మనకు దూరంగా ఉండవు. మనకు సన్నిహితంగానే ఉండి, మంచిని కలుగజేస్తాయి. అపుడు శ్రీకృష్ణుడు ఎక్కడో, ద్వారకలో ఉన్నాడు. అయినప్పటికీ, హస్తినాపురంలో ఉండే ద్రౌపదికి కలిగిన ఆపదను తీర్చినది భగవాన్నామమే కదా. తనకు ఆపద కలిగిన సమయంలో "గోవిందా! " అని ఆమె ఎలుగెత్తి భగవాన్నామాన్ని అనుసంధానం చేసింది. అపుడుశశ్రీకృష్ణుడు రాలేదు కానీ, నామప్రభావం చేత ఆమె కోరిన మానసంరక్షణ సిద్ధించింది. అందువల్లనే, భీష్ముడు ధర్మపుత్రుని ఉద్దేశించి తాను చెప్పే మాటను ఆశతో, ఆదరంతో "శ్రుణు పాపభయాపహమ్" అని వినమని అంటున్నాడు.

మనంకూడా ప్రతిదినం శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రాన్ని పారాయణం, చేసి మనకు కలిగే భయాలను, వాటికి మూలమైన పాపాలను పోగొట్టుకుందాం, రండి.



# 11. భగవంతుని కరుణ ఒక దివ్యాయుధం

భగవంతుని కరుణ వల్ల మనకు అందరికీ మంచి కలుగుతుంది. అతని కృప లేకపోతే ఈ లోకం లేదు. ఆ లోకం లేదు మనకు ఏర్పడిన వ్యాధి నయం కావడం కోసం, లేక, వేరు ఏ కష్టం అయినా తీరడానికి, మనోవ్యాధి తొలగిపోవడానికి కానీ, ఈ విధంగా ఈ లోకంలో ఉండే కష్టాలు ఏమైనా అవి తీరడం కోసం, లేక, మనం తరించటానికి కావలసిన జ్ఞానం, కలగడానికి, భక్తి కలగడానికి, చేసిన శరణాగతిగా ఫలించడానికి, వాటిని ఆచరించడానికి కావలసిన ఇంద్రియ విగ్రహాన్ని పొందడానికి, ఈ విధంగా ఉండే అలౌకికమైన పురుషార్థాన్ని పొందడానికి కానీ, భగవంతుని దయయే కారణం అవుతున్నది.

ఈ విధంగా ఇహలోక పరలోక పురుషార్థసాధకమైన భగవంతుని అనుగ్రహాన్ని ఉద్దేశించి ఆళ్వార్లు కీర్తించేటప్పుడు, "అరుళ్ ఎన్నుమ్ తండాల్ ఆడిత్తు", " అరుళ్ ఎన్నుమ్ ఒళ్ వాళ్ ఉరువి" అని అంటూ దయను ఒక దండంగా, ఒక ఖడ్గంగా రూపించి పలుకుతున్నారు. భగవంతుని దయ అనేది చాలా ఆర్ద్రంగా, మృదువైనదిగా ఉంటుంది కదా. దాన్ని మరి ఆళ్వారులు ఇక్కడ చాలా కఠినమైన, నిశితమైన గదగా, దండంగా, కత్తిగా రూపించి పలుకుతున్నారే? అని అంటే దానికి ఒక కారణం ఉన్నది.

భగవంతుని భక్తుల పాపాలను తీర్చడం కోసం, వారి క్లేశాలను కలిగించే దుష్టులను నిరసించడం కోసం తన చేతులలో దివ్యాయుధాలను ధరించి ఉన్నాడు. తన ఆ ఆయుధాలను ఉపయోగించి స్వామి మనలను రక్షిస్తాడు. ఒక్కొక్కసారి తన సంకల్పంతో రక్షిస్తాడు తన దివ్యాయుధాలను ఉపయోగించి మరొక్క సారి రక్షిస్తాడు. శ్రీ కృష్ణావతారంలో చక్రాయుధాన్ని ఉపయోగించి ఎంతో మంది దుష్టులను సంహరించడానిన్ని మనం గమనించవచ్చు. శ్రీరామావతారంలో కోదండంతో ఎంతో మంది రాక్షసులను సంహరించాడు. పరశురామావతారంలో గొడ్డలితో దుర్మార్గులను వధించాడు. బలరామావతారంలో నాగలిని ఆయుధంగా ఉపయోగించాడు. ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క విధమైన ఆయుధాన్ని ఉపయోగించి, దుష్ట నిరసనాన్ని చేసాడు. ఈ విధంగా ఖడ్గం, విల్లు మొదలైన ఆయుధాలను ఉపయోగించి మన శత్రువులను భగవానుడు వధించే విషయం మనకు తెలుసు. ఈ వృత్తాంతాలు మనకు ఇతిహాసాలలో, పురాణాలలో స్పష్టంగా కనబడతాయి. ఈ విధంగా, ఇటువంటి ఆయుధాలతో భగవంతుడు నిరసించే విరోధులు బాహ్యవిరోధులు. మన కంటికి కనిపించే విరోధులు.

అయితే, భగవంతుని దయను ఆళ్వార్లు దండంగా, గదగా, విల్లుగా, కత్తిగాఎందుకు పలుకుతున్నారు? అంటే, భగవంతుడు ఈ దయ అనే ఆయుధాన్ని ఉపయోగించి వేరు విధమైన, మనలో, ఉండే మనకు చాలా హాని కలిగించే శత్రువులను నిరసిస్తున్నాడు. శత్రువులను నిరసించేది ఏదైనా అది ఆయుధమే కదా. ఈ శత్రువులు మనకు బయట కనిపించే శత్రువులు కారు. మన లోపల ఉంటూ, మనకు కనిపించకుండా ఉండి, బయట శత్రువులు చేసే హానికంటే ఎక్కువ హానిని చేస్తాయి. ఇవి కామం, క్రోధం మదం మాత్సర్యం, లోభం మోహం అనే ఆరు విధాలయినవి. చాలా బలమైనవి, తీవ్రమైనవి. ఆ విధంగానే, అహంకార మమకారాలు, అన్యశేషత్వం మొదలైనవి కూడా ఇటువంటి శత్రువులే.

బయట కనిపించే అసురులను, రాక్షసులను సంహరించడం కోసం చక్రం, విల్లు, గద మొదలైన ఆయుధాలను భగవానుడు ప్రయోగిస్తాడు. మనలోనే ఉంటూ, కనిపించకుండా ఉండే ఈ కామం, క్రోధం మొదలైన శత్రువులను పోగొట్టడం అనే కార్యం ఈ ఆయుధాల వల్ల సాధ్యం కాదు. చక్రాన్ని ఉపయోగించి మనలో ఉండే అహంకార మమకారాలను పోగొట్టడం సాధ్యం కాదు కదా. ఆ విధంగా ప్రయోగిస్తే, మనలో ఉండే అహంకారం పోదు సరిగదా, మనమే లేకుండా పోతాం. అందువల్ల మనలను చూసి, మనపై కరుణను కలిగిన భగవంతుడు, " వీడిని కాపాడేవాడు ఎవడు లేకుండా ఉన్నాడే! వీడు తనకు తానే అంతు లేని హానిని చేసుకుంటున్నాడు. నష్టాన్ని కలిగించుకుంటున్నాడే. ఈ దోషాల కారణంగా శాశ్వతంగా సంసారంలో కూరుకుపోతున్నాడే! వీడిని సంసారం నుండి ఏ విధంగానైనా బయటపడేయ్యాలి. మంచి గుణాలను కలిగినవానినిగా చేయాలి" అని జాలిపడి తన దయ అనే ఆయుధాన్ని ప్రయోగిస్తాడు. తన కరుణతో మనలో ఉండే దోషాలను పోగొట్టి, మనలను పరిశుద్ధులను చేస్తాడు. మంచి స్వభావాలను కలిగినవారినిగా చేస్తాడు.

బయట ఉండే శత్రువులను నశింప చేసేది అయితే ఏమి, లోపల ఉండే శత్రువులను నిరసించేది అయితే ఏమి, శత్రువులను నశింప చేసేది ఏదైనా ఆయుధమే కదా. అందువల్ల భగవంతుని దయ కూడా ఒక విధంగా ఆయుధమే అవుతున్నది. ఒక్కొక్కసారి ఆ స్వామి కోపం కూడా ఆయుధం అవుతుంది. గద, విల్లు, చక్రం మొదలైనవి కూడా ఆయుధాలు అవుతున్నాయి. ఈ విధంగా దయ, చక్రం మొదలైనవి మన శత్రువులను నశింప చేయడం చేత ఇవి అన్నీ ఆయుధాలే అవుతున్నాయి. అందుచేతనే అళ్వార్లు "అరుళ్ ఎన్నుమ్ తండాల్ ఆడిత్తు", " అరుళ్ ఎన్నుమ్ ఒళ్ వాళ్ ఉరువి" అని అనుగ్రహించారు.

ఇకపై మనం కోవెలకు వెళ్ళినప్పుడు భగవంతుడు ఎందుకు తన చేతిలో విల్లు, చక్రం, గద మొదలైన ఆయుధాలను ధరించి ఉన్నాడు? అని భావించనక్కరలేదు. సందేహించనక్కరలేదు. ఎందుకు ధరిస్తున్నాడో మనకు ఇపుడు కారణాలు తెలిసినవి కదా. వీటిని ధరించడంలో రెండు విధాలైన ప్రయోజనాలు ఉన్నాయి. తాను ఆ దివ్యాయుధాలను ధరించినప్పుడు ఏర్పడే అందంతో భక్తులను మనసులను ఆకర్షించి, వారి పాపాలను తీర్చి ఆనందింప చేయడం కోసం, తన భక్తులకు హానిని కలిగించే రావణ శిశుపాలాదులను వధించడం కోసం, ఈ విధంగా ఉండే రెండు విధాలయిన ప్రయోజనాల కోసంగా భగవంతుడు దివ్యాయుధాలను తన చేతిలో ధరిస్తాడు. అందుచేత భగవంతుని దయ ఈ విధంగా దివ్యాయుధాలుగా రూపొందినవి దిఅని భావించడంలో ఏ అడ్డు లేదు కదా.

అందువల్ల, ఇక మనం కోవెలకు వెళ్ళినప్పుడు భగవానుడు తన చేతులలో దివ్యాయుధాలన ధరించిన సన్నివేశంలో గోచరించే అలౌకికమైన అందాన్ని కళ్ళార దర్శించి, ఆ స్వామికి మంగళాశాసనం చేద్దాం. మన స్వరూపానికి అనుగుణమైన సేవను చేసికొందాం. స్వస్తి.



# 12. ఆత్మవ్యాధిని తీర్చే వైద్యుడు సదాచార్యుడే

ఈ శరీరంలో ఆత్మ ఉన్నది, పరమాత్మ కూడా ఉన్నాడు. శరీరంలోపల ఉండే హృదయంలో ఆత్మ, పరమాత్మలు ఇద్దరూ ఉన్నారు ఇద్దరూ చాలా దగ్గరగా కదా ఉన్నారు. మరి, ఈ జీవాత్మ, తనకు చాలా సమీపంలో ఉండే పరమాత్మను తెలుసుకోవడం కోసం ఎక్కడో బయట, చాలా దూరంలో ఉండే ఒక ఆచార్యుని దగ్గరకు వెళ్ళవలసిన అవసరం ఏమున్నది? పక్క పక్కన ఇళ్లల్లో ఉండేవారికి ఒకరికొకరు పరిచయం కలగడానికి వేరొకరు ఆవశ్యకమా? ఆ విధంగానే, హృదయంలోనే ఒకే చోట ఉండే ఆత్మ పరమాత్మలలో, పరమాత్మనుగూర్చి ఆత్మ తెలుసుకోవడానికి ఆచార్యుని ఆవశ్యకత ఏమున్నది? జీవుడు స్వయంగానే పరమాత్మను తెలుసుకోవచ్చు కదా! ఆశ్రయించవచ్చు కదా! ఆ విధంగా తెలుసుకోవడంలో, ఆశ్రయించడంలో ఏమి అడ్డు వస్తున్నది? ఎందుకోసం, ఎక్కడో ఉండే ఆచార్యుని కోసం అన్వేషించి వెళ్లి, ఆయనను ఆశ్రయించాలి? అనేది సాధారణంగా కలిగే ప్రశ్న. దీనికి సమాధానం ఏమిటో కొంచెం గమనిద్దాం.

భగవానుడు జీవునకు అత్యంత సమీపంలో ఉన్నాడు అనేది వాస్తమే. ఈ శరీరానికి ఆత్మ ప్రభువు. ఈ ఆత్మ కోసమే కదా ఈ శరీరం ఉపయోగపడుతున్నది. శరీరానికి వ్యాధి వచ్చిందని అనుకోండి. అప్పుడు ఆ వ్యాధిని నయం చేసుకోవలసిన బాధ్యత ఆ శరీరంలో ఉండే ఆత్మ పైన ఉన్నది కదా. దానిని పోగొట్టుకోవలసిన బాధ్యత ఆత్మదే కదా. అందువల్లనే లోకంలో మనకు వ్యాధి కలిగినప్పుడు, దానిని పోగొట్టుకోవడం కోసం అతడే వైద్యుని దగ్గరకు వెళుతున్నాడు. "నా శరీరానికి ఏదో వ్యాధి వచ్చింది, నయం చేయండి" అని ఆ వైద్యుని ప్రార్థిస్తాము. అప్పుడు ఆ వైద్యుడు "ఎందుకు నా దగ్గరకి మీరు వస్తారు? మీ శరీరం మీకు చాలా దగ్గరగానే ఉన్నది కదా. మీరే దానిని బాగు చేసుకోవచ్చు కదా! నా ఆవశ్యకత ఏమున్నది? " అని అన్నాడని అనుకోండి. అప్పుడు మనమేమంటాము? " ఆ విధంగా కాదు. నాకు నేనే నాకు కలిగిన రోగాన్ని పోగొట్టుకోవడం సాధ్యం కాదు. ఈ శరీర తత్వం ఏమో నాకు తెలియదు. ఏమి చేస్తే ఏ రోగం వస్తుందో నాకు తెలియడం లేదు. శరీరానికి సంబంధించిన తత్వాలను తెలిపే శాస్త్రాన్ని నేను చదువుకోలేదు. ఏం చేస్తే ఏ వ్యాధి వస్తుందో తెలియదు. నాకు తెలియకుండా ఏదేదో చేస్తున్నాను. దాని ఫలంగా నాకు ఈ విధంగా వ్యాధులు కలుగుతున్నాయి. వచ్చిన ఈ వ్యాధులు పోవడానికి ఏమి చేయాలో కూడా నాకు తెలియదు. వాటిని గూర్చిని తెలిసిన మీరే నాకు కలిగిన ఈ వ్యాధిని పోగొట్టాలి" అని అంటాము. అప్పుడు ఆ వైద్యుడు "సరే, ఇతనికి తన రోగాన్ని పోగొట్టుకోవడం

తెలియదు కాబోలు. తనకు తెలియదని అంటున్నాడు. ఇతని రోగాన్ని లేకుండా చేద్దాం" అని ప్రయత్నించి, విచారించి రోగ నిదానం ఏమిటో తెలుసుకొని, తగిన మందులను వ్రాసి ఇస్తాడు. అప్పుడు మనం కూడా వైద్య విక్రయశాలకు వెళ్లి ఆ మందులను తెచ్చుకుంటాము. ఆ మందులు ఇక్కడే సిద్ధం చేయబడినవి కూడా కాకపోవచ్చు. ఎక్కడో, వేరు వేరు దేశాలలో, వేరు వేరు ప్రాంతాలలో తయారు చేయబడినవి కూడా కావచ్చు. అవి మన వ్యాధిని నయం చేస్తాయి. మనకు ఆరోగ్యాన్ని కలిగిస్తాయి. ఇది న్యాయమేనా? న్యాయంగా ఉన్నదా? గమనించండి. వేరు ఎక్కడో మనకు దూరంగా ఉండే వైద్యుడు పరీక్ష చేసి, మందులను రాసి ఇస్తున్నాడు. ఆ మందులు కూడా ఎక్కడెక్కడో తయారు అవుతున్నాయి.

మందులను ఉపయోగించుకుని మనం మనకు కలిగిన వ్యాధులను పోగొట్టుకుంటున్నాము. కానీ, ఈ శరీరానికి పక్కనే ఆత్మ ఉన్నది. ఈ ఆత్మ, దేహం పక్కనే ఉన్నాయి. ఎందుకు మరి, ఆత్మ, ఈ శరీరంలో ఉండే ఆత్మ, తన శరీరానికి వ్యాధి కలిగినప్పుడు స్వయంగా నయం చేసుకోలేకపోతున్నది? అని అంటే, ఈ ఆత్మకు, తన శరీరానికి కలిగిన వ్యాధిని గూర్చిన ఎవరని తెలియదు. దానికి కారణాన్ని కూడా అది తెలియలేదు. ఈ ఆత్మ, తన శరీరానికి కలిగిన వ్యాధిని గూర్చిన శాస్త్రాన్ని చదవలేదు. అందువల్ల దానిని ఏ విధంగా పోగొట్టుకోవాలో దానికి తెలియదు. ఆ శాస్త్రాన్ని చదివి తెలిసిన వైద్యుని దగ్గరకు వెళితే గాని ఆ రోగం తీరదు. ఆ వైద్య శాస్త్రాన్ని చదివిన వైద్యుడు కూడా తానే స్వయంగా పోగొట్టడం లేదు. మరి ఏమి చేస్తున్నాడు? వైద్యుడు మన కాళ్ళను, చేతులను, గుండెలను పరీక్ష చేసినంత మాత్రంతో రోగం సరికాదు కదా. వచ్చిన రోగానికి తగిన మందును తింటే కదా, వ్యాధి తగ్గుతుంది. అందుకోసం, అతడు తగిన మందును వ్రాసి ఇస్తున్నాడు. అయితే, ఆ మందు వైద్యుని దగ్గర లేదు. ఎక్కడెక్కడో తయారైన మందు అది.

ఈ విధంగానే, సదాచార్యుడు వైద్యునివంటివాడు. మనకు బయట ఉండే, దూరంగాఉండే ఆచార్యుని దగ్గరకు వెళ్లి మనం తప్పక ఆశ్రయించాలి. ఆ విధంగా ఆశ్రయిస్తే తప్ప, మన ఆత్మకు ఏర్పడిన ఆత్మవ్యాధి తీరదు. ఎందువల్లనంటే, ఆ సదాచార్యుడు అనే వైద్యుడు. మాత్రమే మనం ఏమేమి తప్పులు చేస్తున్నామో, ఏ విధంగా ప్రవర్తిస్తే ఏమి హాని కలుగుతున్నదో తెలియగలడు. దానికి తగిన మందు ఏదో తెలియగలడు. మనకు తెలియజేయగలడు. ఆత్మకు కలిగిన వ్యాధిని గూర్చిన వివరాన్ని అతడే తెలియగలడు. ఆత్మకు ఏర్పడే వ్యాధిని గూర్చిన వ్యాధి ఏ విధంగా తీరుతుందో, ఆ

విషయాన్ని, దానికి సంబంధించిన వివరాలను తెలియజేసే శాస్త్రాన్ని ఆచార్యుడే అధ్యయనం చేశాడు. ఆ శాస్త్రం మనకు తెలియదు కనుక. మనం తప్పక ఆచార్యుడనే వైద్యుని దగ్గరకు వెళ్లాలి.

మనం ఆచార్యుల దగ్గరకు వెడితే, , అతడు ఏమి చేస్తాడు? మనకు తగిన ఉపదేశాలను చేస్తాడు. తనకు ముందున్న ఆచార్యులు చేసిన ఉపదేశాలను, వారి అనుష్ఠానాలను మనకు తెలియజేస్తాడు. భగవంతుని దయను గూర్చి, ఆ స్వామి దివ్య లీలలను గూర్చి తెలియజేస్తాడు. వీటిని అన్నిటిని మనకు తెలియజేసి, మన ఆత్మకు కలిగిన వ్యాధిని తీరుస్తాడు. ఆ విధంగా సదాచార్యులు చేసే ఉపదేశాలే మన ఆత్మకు కలిగిన వ్యాధిని నయం చేసే మందు. ఆచార్యుడు మనకు మంచిని ఉపదేశిస్తాడు. తాను ఆచరించి చూపిస్తాడు. పూర్వాచార్యుల ఆచరణలను తెలియజేస్తాడు. మనం చేసే పనులలో, మన ప్రవర్తనలో ఉండే దోషాలను మనకు తెలియజేస్తాడు. ఏ విధంగా సరిగా నడుచుకోవాలో, ఆ ప్రకారాన్ని తెలియజేస్తాడు. మనలను సంస్కరించి, మనకు భగవంతుని దయ లభించేటట్లు చేస్తాడు. దానివల్ల మన ఆత్మకు కలిగిన వ్యాధి నయం అవుతుంది. ఆచార్యుడు చేసే ఉపదేశాలు, ఆయన చేసి చూపించే ఆచరణలు, ఇవే మన ఆత్మకు కలిగిన వ్యాధిని తీర్చే మందు. సదాచార్యుడు, ఆయన చేసే ఉపదేశాలు, ఆచరణలు ఇవి అన్ని మనకు బయట ఉన్న విషయాలే కదా. మనలో ఉన్నవి కాదు కదా. అందువల్లనే సదాచార్యుడు లేకుండా మనలను మనం సంస్కరించుకోవడం సాధ్యం కాదూ.

ఒక వైద్యుడు ఇచ్చే మందు కలిగే శరీరానికి వ్యాధిని నయం చేస్తుంది. ఆ విధంగానే ఆత్మకు కలిగే వ్యాధిని సదాచార్యుడు చేసే ఉపదేశాలు, అనుష్ఠానాలు, దానివల్ల లభించే భగవంతుని కరుణ అనే మందులు తీరుస్తాయి. మనకు కలిగిన ఈ సంసారం అనే వ్యాధి తీరుతుంది. ఈ లోకంలో మనం సుఖదుఃఖాలను మాటిమాటికి అనుభవిస్తూ ఉన్నాము కదా. అదే సంసారం. ఈ సంసారం అనే వ్యాధి ఎటువంటిది అనేది మనకు తెలియదు. లోకంలో దేహానికి వచ్చే వ్యాధులను గూర్చి మనకు తెలిస్తే, తెలియవచ్చునేమో కానీ, ఈ సంసారం అనే వ్యాధిని గూర్చిమాత్ర మనకు తెలియదు. ఎందుకు ఈ సంసారం మనకు మాటిమాటికి ఏర్పడుతున్నది? ఎందువల్ల మనం ఈ విధంగా నిరంతరంగా సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాము? అనే సంగతి మనకు అంత సులభంగా అర్థం కాదు. తెలియదు. అందువల్లనే, దానిని గూర్చి చక్కగా తెరిచిన సదాచార్యుని దగ్గరకు వెళ్ళాలి. ఆ సదాచార్యుడు వీటికి సంబంధించిన వివరాలను అన్నిటిని శాస్త్రాల ద్వారా పెద్దల అనుష్ఠాన,

ఉపదేశాల ద్వారా చక్కగా గ్రహించి ఉంటాడు. ఆ సదాచార్యుడు మనలను గమనించి, మనకు కలిగిన ఆత్మవ్యాధిని అనే సంసారాన్ని గూర్చి తెలుసుకొని, తగిన మందును తెలియజేస్తాడు. అప్పుడే ఆ వ్యాధి నయం అవుతుంది.

అంతే తప్ప, "నేను భగవంతుడు ఈ శరీరంలో పక్కపక్కనే ఉన్నాము. నేను భగవంతుని చేరడానికి, తెలుసుకోవడానికి వేరొక వ్యక్తి, బయట ఉండే వ్యక్తి అయిన ఆచార్యుడు ఎందుకు కావాలి? ఎక్కడో ఉండే వైద్యుడు మనకేమి సహాయం చేస్తాడు? ఆయనకి ఏమి తెలుసు? అని భావించకూడదు. ఎవరైనా, "సదాచార్యుడు ఎందుకు? ఆయన ఉపదేశాలతో ఏమి పని? " అని ప్రశ్నిస్తే, అపుడు "మన శరీరానికి కలిగే వ్యాధిని తెలుసుకొని, తగిన మందును తెలిపే వైద్యుడు, ఆ వ్యాధిని తీర్చే మందు మనలోనే ఉన్నాయా? బయట ఉన్నాయా? అని తిరిగి ప్రశ్నించండి. ఇక మళ్లీ ఆ ప్రశ్నను ఎవరు ఎపుడూ అడగరు.

★★★★★

# 13. ఈ ముగ్గురిలో మనం ఎవరం?

శ్రీరామాయణంలో మనకు ఎంతో మంది వ్యక్తులు కనిపిస్తారు. వారిలో రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు అనే ముగ్గురి వ్యక్తుల స్వరూప స్వభావాలు జాగ్రత్తగా గమనించదగినవి.

వీరు ముగ్గురూ సోదరులు. వీరు ముగ్గురు రాక్షసులు. వీరు ముగ్గురు చాలా గొప్ప తపస్సును చేసి వరాలను పొందినటువంటివారు. ఈ ముగ్గురు చాలా శక్తి సామర్థ్యాలను కలిగినవారు. ఈ విధంగా వీరి ముగ్గురిలో కొన్ని సామ్యాలు ఉన్నప్పటికీ, కొన్ని వైషమ్యాలు మనకు గోచరిస్తాయి. వీటిని గమనించినప్పుడు, మనం జీవితంలో ఏ విధంగా ప్రవర్తించాలో తెలుసుకోవచ్చు.

ముందుగా కుంభకర్ణుని గమనిద్దాం. ఇతడు చాలా సమయం నిద్రపోతూనే ఉంటాడు. ఈ విధంగా కాకుండా, రావణుడు మేల్కొని ఉంటాడు. లోకంలో మనం ఏమని భావిస్తాము? ఎల్లప్పుడూ నిద్రపోయేవానికంటే, మేల్కొని ఉండేవాడు నయం అని కదా అనుకుంటాము. కానీ వాస్తవానికి ఇక్కడ ఆ విధంగా కాదు. కుంభకర్ణుడు ఎల్లప్పుడూ నిద్రపోతాడు. ఆ విధంగా అతడు నిద్రపోవడమే మంచిది అయినది. ఎందుకంటే, సమయంలో అయినా అతడు దుష్కృత్యాలను చేయకుండా ఉన్నాడు. భగవంతుని ఎదిరించకుండా ఉన్నాడు. అందువల్ల అతడు ఎక్కువసేపు నిద్రపోవడమే మంచిది అయినది. ఆ విధంగా కాకుండా, మేల్కొని ఉన్న రావణుడు ఏమి చేశాడు? అన్నీ దుష్కృత్యాలనే చేశాడు. శ్రీరాముని ఎదిరించాడు. రావణుడు శారీరకంగా మేల్కొని ఉన్నాడు తప్ప, ఆత్మ విషయం గా మేల్కొని లేడు. నిద్రపోతూనే ఉన్నాడు. ఇక్కడ మేల్కొని ఉండడం అంటే, ఆత్మ జ్ఞానాన్ని కలిగి ఉండడం. వివేకాన్ని కలిగి ఉండడం. అది రావణునిలో లేదు కదా. అతడు మేల్కొని ఉండి ఏమి ప్రయోజనం కనుక! ఈ విధంగా గమనించినప్పుడు, రావణుడు మేల్కొని ఉండి భగవంతునకు ఎదురు నిలిచి దుష్కృత్యాలను చేయడం కంటే, కుంభకర్ణుడు ఎల్లప్పుడూ నిద్రపోయి భగవంతునికి ఎదురు నిలవకపోవడమే మంచిది అయినది. నిద్ర నుంచి లేచి అతడు ఏమి చేశాడు? లేచిన వెంటనే శ్రీరామునకు ఎదురు వెళ్ళాడు కదా! అందుచేత అతడు నిద్రపోవడమే మంచిది అయినది.

సరే, ఇప్పుడు మేల్కొని ఉండడం కంటే, నిద్రపోవడమే మంచిదని భావించడం మంచిదా? మేల్కొని ఉన్న విభీషణుని కంటే నిద్రపోయే కుంభకర్ణుడు నయం అని భావించవచ్చునా? విభీషణుని మెలకువ కంటే కుంభకర్ణుని నిద్రయే మంచిది అని అనుకోవచ్చునా? అనే సందేహం కలుగవచ్చు. కానీ, ఆ విధంగా భావించడం సరి కాదు.

రావణుని మెలకువ కంటే, కుంభకర్ణుడి నిద్ర మంచిది అని అనుకున్నాము. ఎందుకోసం? మెలకువగా ఉండి భగవంతునకు వ్యతిరేకంగా వర్తించటం కంటే, నిద్రపోవడం మంచిది కనుక, నిద్రపోయి ఎదురు నిలవకుండా ఉండడమే మంచిది కనుక. "ఆజగామ ముహూర్తేన యత్ర రామః సలక్ష్మణః" అనేది వాల్మీకి రామాయణంలోని సూక్తి. "రాముడే ఆశ్రయించదగినవాడు, అతడే రక్షకుడు" అని భావించి తెలిసి కొన్న మరుక్షణమే విభీషణుడు ఎంత మాత్రం ఆలస్యం చేయకుండా, వేగంగా వచ్చి భగవంతుడైన శ్రీరాముని ఆశ్రయించాడు. ఈ పనిని ఎందువల్ల అతడు చేయగలిగాడు? మేల్కొని ఉన్నందువల్లనే కదా, చేయగలిగాడు. కుంభకర్ణుని వలే నిద్రపోతూ ఉంటే ఈ పని చేయడం సాధ్యమా? అందుచేత మెలకువతో ఉండడమే మంచిది అని తెలుస్తుంది. అయితే, మెలకువతో ఉంటే అది రావణుని మెలకువ వంటి మెలకువ కాకూడదు విభీషణుని మెలకువ వంటిదే కావాలి.

కుంభకర్ణుడు, రావణుడు, విభీషణుడు అనే ఈ ముగ్గురి ఉదాహరణ బట్టి మనకు ఇపుడు ముఖ్యంగా రెండు విషయాలు అర్థం అవుతున్నాయి. మనకు లోకంలో ఒక విషయాన్ని గూర్చి చక్కగా తెలియాలి అంటే, ముఖ్యంగా ప్రకాశం అనేది ఉండాలి. వెలుతురు అనేది ఉండాలి. వెలుతురు ఉంటే చాలదు. ఆ వెలుతురులో వస్తువు యొక్క స్వరూప స్వభావాలను చూడగలిగిన కన్ను ఉండాలి. కన్ను ఉంటే చాలదు, ఆ కన్ను సరిగా ఉండాలి. కన్ను ఉండి వెలుతురు లేకపోయినా, వస్తు జ్ఞానం కలగదు. కన్ను లేకుండా వెలుతురు ఉన్నప్పటికీ, వస్తు జ్ఞానం కలుగదు. ఈ రెండు తప్పక ఉండాలి. ఆ విధంగానే, మనం మెలకువతో ఉండాలి. కుంభకర్ణుని వలె నిద్రపోయి ఉపయోగం లేదు. మెలకువతో ఉండడంతో పాటు, మంచి స్వభావాన్ని కలిగి ఉండాలి, మంచి దృష్టిని కలిగి ఉండాలి. మెలుకువగా ఉన్నప్పటికీ, రావణునివలె దృష్టి సరిగా లేకపోతే ప్రయోజనం లేదు. ఈ రెండు ఉన్నప్పుడే మనం విభీషణునివంటివారం కాగలము.

ఇప్పుడు ఈ విషయాలను మన విషయంలో అన్వయించుకుని గమనిద్దాం. మనం కుంభకర్ణుని వలె ఎల్లప్పుడూ నిద్రపోతూనే ఉన్నామా? మనకు మెలకువ అనేది లేదా? ఒకవేళ మెలకువ ఉన్నప్పటికీ, అది సరైన మెలకువగా ఉన్నదా? భగవద్విషయంలో సరైన

జ్ఞానాన్ని కలిగి ఉన్నామా? లేక, ఏదో లౌకికమైనటువంటి విషయాలలోనే దృష్టిని కలిగి, జ్ఞానాన్ని కలిగి ఉన్నామా? అంతమాత్రమేనా మన మెలకువ ఉన్నది! పగటి వేళ సూర్యుడు ఉదయిస్తున్నాడు. పగటి కాలం వచ్చింది, సూర్యుడు ఉదయిస్తున్నాడు –అని అన్నంత మాత్రంలో అందరూ మేల్కొంటారు అని చెప్పడానికి లేదు. నేనిక్కడ ఈ లోకంలో ఉండే అందరు పగటి కాలంలో మేల్కొని ఉండడాన్ని గూర్చి చెప్పడం లేదు.

మనం, చాలా కాలంగా అనాదిగా ఈ సంసారంలో నిద్రపోతూనే ఉన్నాము. వివేకాన్ని లేకుండా ఉన్నాము. అటువంటి నిద్ర నుండి మనం మేల్కోవాలి. వెలుతురును చూడగలగాలి. ఆ వెలుతురు మనల్ని చూడగలిగినప్పుడు, ఇక మళ్లీ నిద్ర అనేది మనకు రాదు. "కుంభకర్ణుడు దీర్ఘ నిద్రపోయాడు, దీర్ఘనిద్ర పోయాడు" అని అంటున్నాము. మనం ఈ సంసారంలో పోయే నిద్ర కూడా అటువంటి కుంభకర్ణుని నిద్ర వంటిదే. వనం మన నిద్ర నుండి మేల్కోవాలి. కానీ, అంత మాత్రం చాలదు. మేల్కొన్నంత మాత్రం చాలదు. ఆ మెలకువలో ఉండే దృష్టి సరైనదిగా ఉండాలి కదా. ఆ దృష్టి సరియైనది కాకుండా, రావణుని దృష్టి వలె ఉంటే, ఏమీ ఉపయోగం లేదు. విభీషణుని దృష్టి వలె సరి అయిన దృష్టిగా ఉండాలి. వివేకాన్ని కలిగి ఉండాలి. మంచి చెడులను తెలుసుకోగలిగి ఉండాలి. అప్పుడే దృష్టి ఉన్నదానికి ప్రయోజనం కలుగుతుంది.

అందువల్ల ఇక్కడ రెండు విషయాలు ఉన్నాయి. మనం మెలకువను కలిగి ఉండాలి, అంటే, జ్ఞానాన్ని కలిగి ఉండాలి. ఆ మెలకువలో దృష్టి సరి అయినదిగా ఉండాలి, అంటే, ఆ జ్ఞానం సరి అయినదిగా ఉండాలి. విభీషణుని దృష్టి వలె అప్పుడే మెలకువ ఉన్నదానికి దృష్టి ఉన్నదానికి ప్రయోజనం కలుగుతుంది. ఆ విధంగా మనం విభీషణుని వలె మేల్కొని ఉందాం ఆ మెలకువలో సరైన దృష్టిని కలిగి ఉందాం.



# 14. అభిజిత్ లగ్నం అంటే

అభిజిత్ అనేది కాంతిలేని నక్షత్రం. పురాణాల్లో దీని వెనుక ఓ ఆసక్తికర కథ కూడా ఉంది.

నక్షత్రాలు ఎన్ని అని అడిగితే అందరూ టక్కున చెప్పే సమాధానం ఇరవై ఏడు అని. కానీ అభిజిత్ అనే ఓ నక్షత్రం ఉందనీ, దానికి కొంత ప్రత్యేకత ఉందని ఎంతమందికి తెలుసు?

ఆ విశేషాలేమిటో మనం తెలుసుకుందాం.

అభిజిత్ అంటే కనిపించని చుక్క అని మనం అనుకోవచ్చు. అంటే కాంతిలేనిదన్నమాట. నిజానికి నక్షత్రం అనేది కూడా ఒక్కటి కాదు···. అనేక నక్షత్రాల సమూహం. వీటిని 27 మండలాలుగా విభజించి వాటికి అశ్విని, భరణి ..... అంటూ పేర్లు నిర్ణయించారు. ఇక అభిజిత్ విషయానికి వస్తే ఉత్తరాషాఢ నక్షత్రం చివరి పాదం, శ్రవణా నక్షత్రంలోని మొదటి 15ఘడియలు కలిపి అభిజిత్ నక్షత్రం గా చెప్పబడింది. ఇది లక్ష్మీనారాయణాత్మకమైనది. ఉత్తరాషాఢ మహాలక్ష్మీ సంబంధం. శ్రవణం నారాయణ సంబంధం. అందుచేతనే ఇది విజయప్రదమని పేరు. మధ్యాహ్నం లో సూర్యోదయాదో నాలుగవ లగ్నం అభిజిత్ అని అంటారు.

ఈ నక్షత్రం వెనుక ఓ పురాణ కథ ఉంది అదేంటో మనం తెలుసుకుందాం.

మనకున్న 27 నక్షత్రాలనూ దక్షప్రజాపతి కుమార్తెలుగా చెబుతారు. దక్షుడు వీరిని చంద్రుడికి ఇచ్చి పెళ్లి చేశాడు. అందరికన్నా రోహిణి మీదే చంద్రుడికి ప్రేమ ఎక్కువ. ఆమెతోనే ఎక్కువ కాలం గడిపేవాడు. మిగతా నక్షత్రాలు ఊరుకున్నా శ్రవణం మాత్రం ఊరుకోలేదు. తనలాగే ఉండే తన ఛాయను తీసి తన స్థానంలో ఉంచి చంద్రుడి వ్యవహారం తేల్చడానికి తండ్రి దగ్గరకు వెళ్లింది. శ్రవణా నక్షత్రం వదిలిన ఛాయ పేరే అభిజిత్తు. అది 28వ నక్షత్రంగా ఏర్పడింది.

ఆ తర్వాత కాలంలో దీనికి ఒక పవిత్రమైన స్థానం కూడా ఏర్పడింది. సర్వ దోషాలనూ పోగొట్టే శక్తి ఈ నక్షత్రానికి వచ్చింది.

ప్రతి రోజూ ఈ నక్షత్రానికి సంధించిన సమయం ఉంటుంది. దాన్నే అభిజిత్ ముహూర్తం అంటారు. ఆ వివరాలు చూద్దాం.

ఈ పదం ఒకప్పుడు పల్లెటూళ్లకు కొత్త కాదు. కాలంమారింది కాబట్టి ఇప్పుడది అంతగా వినపడటం లేదు. అభిజిత్ లగ్నాన్ని పల్లెటూళ్లలో అలా పిలిచేవారు. గడ్డపలుగును భూమిలో పాతిపెట్టి దాని నీడ మాయమయ్యే సమయాన్ని గడ్డ పలుగు ముహూర్తం అనేవారు. అంటే మిట్టమధ్యాహ్నం అన్నమాట.

ఈ ముహూర్తంలో సూర్యుడు దశమ స్థానంలో ఉంటాడని, ఈ ముహూర్తం చాలా దోషాలను పోగొడుతుందని నమ్మకం. నిజానికి ఇది చాలా బలమైన ముహూర్తం.

ప్రస్తుతం రామాలయ నిర్మాణం కోసం అయోధ్యలో జరుగుతున్న భూమిపూజను ఈ అభిజిత్ లగ్నంలోనే చేశారంటే దీనికున్న ప్రాధాన్యం ఏపాటిదో ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. దీన్ని విజయ ముహూర్తం అని కూడా అంటారు.

ఈ ముహూర్తం మధ్యాహ్నం 11–45 నుండి 12–30 వరకు ఉంటుంది.

ఈ ముహూర్తం లోనే శివుడు త్రిపురాసుర వధ చేశాడు.

ఇదే ముహూర్తం లో దేవతలు సముద్ర మధనం ప్రారంభించారు.

ఈ శుభ ముహూర్తం లోనే ఇంద్రుడు దేవ సింహాసనాన్ని అధిరోహించాడు.

శ్రీరాముడి జననం, సీతారాముల కల్యాణం, భీష్మ పితామహుడు ధ్యాన స్థితుడై ప్రాణాలను విడిచిపెట్టిన సమయం. ఇవన్నీ ఈ ముహూర్తంలోనే జరిగాయి.

ఈ ముహూర్తంలో పెళ్ళి జరిగింది కాబట్టి ఇలా కష్టాలు వచ్చాయని అనుకోవడం కూడా తప్పే. అసలు ఆ లగ్నంలో ఏ శుభకార్యం చేపట్టినా, ఇక మిగతా విషయాలు ఏవీ ఆలోచించాల్సిన అవసరమే లేదు.

ఇంకా ఈ ముహూర్తానికి సంబంధించి మరికొన్ని విశేషాలు ఉన్నాయి. ఈ ముహూర్త సమయంలో దక్షిణ దిక్కుకు ప్రయాణం మంచిది కాదని నారద సంహిత పేర్కొంటోంది.

దక్షిణం యమస్థానం కాబట్టి బుధవారం మాత్రం ఆ దిక్కుకు వెళ్లరాదని నారద సంహిత పేర్కొంది.

అలాగే ఉపనయనానికి కూడా ఈ లగ్నం పనికిరాదని పేర్కొంది. దీనికి కొన్ని మినహాయింపులు కూడా ఉన్నాయి.

ఆ నక్షత్రాధిపతుల సమయంలో ఈ అభిజిత్ ముహూర్తం వస్తే మాత్రం దక్షిణ దిక్కుకు నిరభ్యంతరంగా ప్రయాణం చేయవచ్చు. సూర్యుడు చీకటిని ఎలా పారదోలతాడో అలా సర్వదోషాలనూ ఈ ముహూర్తం హరించి వేస్తుందని వశిష్ఠ సంహిత పేర్కొంది. ముహూర్త వల్లరి అనే గ్రంథం మాత్రం అభిజిత్ ముహూర్తం కేవలం ప్రయాణాలకే తప్ప ఇతర కార్యాలకు పనికిరాదని అంటోంది. ఈ లగ్నంలో వివాహం చేస్తే నష్టమని బ్రహ్మ శపించినట్లు నారద సంహిత పేర్కొంది. ఎన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నా అభిజిత్ లగ్నం ఉపనయనానికి తప్ప వివాహాది సమస్త శుభకార్యాలకు ఇది శ్రేష్టం.

సర్వశ్రేయోదాయకమని అనేక గ్రంథాలు పేర్కొన్నాయి.



# 15. అర్థం తెలియని స్తోత్రాలను అనుసంధానం చేస్తే ఏం లాభం?

ఆరు నెలల బిడ్డ ,ఒక సంవత్సరం వయస్సు ఉన్న బిడ్డ, లేక, రెండు సంవత్సరాల వయస్సు ఉన్న బిడ్డ కింద పడితే, దానికి దెబ్బ తగిలి నొప్పి కలుగుతుంది. వెంటనే అది ఏడుస్తుంది. అప్పుడు ఆ బిడ్డకు తనకు కలిగిన నొప్పికి కారణం ఏదో దానికి తెలియదు. ఆ విధంగా,నే బిడ్డకు అజీర్ణం కలుగవచ్చు అప్పుడు కడుపు నొప్పి పెడుతుంది అప్పుడు కూడా ఏడుస్తుంది. ఏ కారణంచేత తనకు శరీరంలో బాధ కలుగుతున్నది అనే సంగతి అప్పుడు కూడా ఆ చిన్న బిడ్డకు తెలియదు. దానికి తెలిసినది ఏమి అంటే, ఏ కారణం చేత తనకు శరీరంలో బాధ కలిగినా వెంటనే ఏడవడం, అది ఒక్కటే దానికి తెలుసు. ఆకలి అయితే ఏడుస్తుంది, తాగిన పాలు జీర్ణం కాకపోతే ఏడుస్తుంది, నిద్ర రాకపోతే ఏడుస్తుంది, నిద్ర వస్తే ఏడుస్తుంది. ఈ విధంగా కారణం ఏదైనా, దానికి ప్రతి క్రియగా ఒకే భాషలో, అంటే, రోదన రూపంలో అది స్పందిస్తుంది. తన బాధను ఏడుపు రూపంలో వ్యక్తం చేస్తుంది ఆరు నెలల బిడ్డకు అసలు ఏమీ తెలియదు. రెండు సంవత్సరాలు అయితే, అంతకంటే కొంచెం మెరుగు. తన చేతులను అటు ఇటు తిప్పుతూ, తనకు కావలసిన వస్తువుల వైపు చూపిస్తూ, వచ్చీ రాని భాషలో "నాకు అది ఇవ్వు, ఇది ఇవ్వు "అని అడుగుతుంది, కాని స్పష్టంగా మాట్లాడడం అప్పుడు దానికి చేతకాదు. అప్పుడు కూడా తనకు కావలసినది స్పష్టంగా తెలియజేయలేనప్పుడు ఏడుస్తుంది. ఆ తరువాత వయస్సు పెరిగే కొద్దీ, మాటలను స్పష్టంగా మాట్లాడడం చెప్పి వస్తుంది అప్పుడు "ఈ కారణం వల్ల నాకు బాధ కలిగింది, నాకు ఇది కావాలి, అది కావాలి" అని మాటలతో స్పష్టంగా చెబుతుంది. ఏ కారణం వల్ల తనకు బాధ కలిగిందో, ఆ కారణాన్ని గూర్చిన జ్ఞానం దానికి తెలుస్తుంది. ఆ తరువాత, ఆరు ఏడు సంవత్సరాల వయస్సు పూర్తి అయిన తర్వాత, క్రమంగా అన్ని తెలుస్తాయి . తన మాటలతో ,చేష్టలతో కుర్రవాడు తనకు ఏర్పడిన బాధను, తనకు కావలసిన విషయాన్ని చేష్టలతో, మాటలతో వ్యక్తం చేస్తాడు.

ఈ విధంగా చాలా చిన్న వయస్సులో ఉండే బిడ్డకు తెలిసిన భాష ఒకటే, అది ఏడుపు. ఆ తరువాత అది పెరిగే కొద్దీ, సైగలు చేయడం, ముద్దు మాటలు మాట్లాడడం, ఆ తరువాత స్పష్టంగా మాట్లాడడం చేస్తుంది. ఇక, బాగా వయస్సు వచ్చిన తరువాత 20

ఏళ్లు పైబడిన తరువాత అన్నీ దానికి  స్పష్టంగా తెలుస్తాయి. తన మనసులో ఉండే అభిప్రాయాన్ని స్పష్టంగా వ్యక్తం చేయగలిగిన సామర్థ్యం ఏర్పడుతుంది.

అయితే, ఆ వయస్సులో కూడా, అదే బాగా వయస్సు వచ్చిన దశలో కూడా, మనకు దెబ్బ తగిలితే,, ఆకలి అయితే, శరీరంలో వ్యాధి ఏర్పడితే, నొప్పి కలుగుతుందికదా. ఆ విధంగా నొప్పి కలిగినప్పుడు చిన్న బిడ్డ ఏడ్చినట్లు మనం ఏడుస్తున్నామా★ లేదే! ",నాకు శరీరంలో ఈ బాధ కలుగుతున్నది, ఈ కారణం వల్ల ఈ బాధ కలుగుతున్నది" అని తెలియజేసి,, దానికి తగిన నివారణోపాయాల కోసం ప్రయత్నం చేస్తాము ఆకలి అయితే అన్నం భుజిస్తాము. శరీరంలో వ్యాధి ఏర్పడితే మందులను తెచ్చుకొని తిని ఆ రోగాన్ని తగ్గించుకుంటాము. ఇది అంతా మనకు మనమే నిర్ణయం చేసుకుంటాం. చిన్న వయస్సులో అయితే,  కారణాన్ని గ్రహించి, తల్లి,  దానికి తగిన నివారణ ఉపాయాన్ని నిర్ణయిస్తుంది వయస్సు వచ్చిన తర్వాత మనమే నిర్ణయాన్ని తీసుకుంటాం.

ఇక్కడ నాకు ఒక సందేహం. మనం చిన్నతనంలో ఏ కారణం వల్ల బాధ కలిగినా, ఏడవడం అనే పనిని కదా చేశాము. మరి వయస్సులో  బాధ కలిగినప్పటికీ, నొప్పి కలిగినప్పటికీ ఏడవకూడదు అని మారిందే! ఆకలి అయితే ఏడవడం–< అని చిన్నతనంలో ఆరంభించాము. ఆకలి 25 సంవత్సరాల వయస్సులో కూడా కలుగుతుంది. అయితే, అప్పుడు ఆ దశలో "ఆకలి అయినా ఏడవకూడదు", అని నిర్ణయించుకుంటున్నాము. ఈ మార్పుకు కారణం ఏమి? ఆ దశలో కూడా ఏడిస్తే ఏమి? ఆ విధంగా ఎందుకు చేయడం లేదు? అంటే, చిన్నతనంలో, మనకు బాధ కలిగినప్పుడు, ఆ బాధ ఎందువల్ల కలిగిందో మనకు  తెలియదు. అది ఏమి చేస్తే తీరిపోతుందో, అది కూడా తెలియదు ఆ విషయాన్ని తల్లి గాని, ఇంకొకరు గానీ గ్రహించి ఆ బాధ తీరడానికి తగిన ప్రయత్నాన్ని చేయాలి. చిన్న బిడ్డ చేయలేదు. అందువల్ల చిన్న బిడ్డ తాను ఏడవడం ద్వారా ఇతరులకు తన బాధను తెలియజేసి, తనకు కలిగిన బాధను తీర్చేటట్లుగా  వారిని ప్రేరేపిస్తుంది. కానీ, వయస్సు వచ్చిన తరువాత బాధ కలిగినా దానికి తగిన ప్రతిక్రియ ఏ విధంగా చేయాలో మనకు తెలుసు. అందువల్ల, ఆ వయస్సులో ఏడవడం అనే భాష ద్వారా ఇతరులకు మన బాధను తెలియజేయవలసిన ఆవశ్యకత లేదు. మనకే మన బాధ ఏమో తెలుసు, దానికి తగిన ప్రతి క్రియనుకృడా తెలుసు దానిని చేసుకోగలిగిన శక్తి కూడా మనకు ఆ వయస్సులో ఉంటుంది ఇది అంతా లౌకికమైన విషయం. లోకంలో మనకు కనిపించే విషయం.

ఈ క్రమాన్ని భక్తి విషయంలో గమనిద్దాం. మనం శారీరకంగా వయస్సు వచ్చిన వాళ్ళం అయినప్పటికీ, ఆత్మజ్ఞాన విషయంలో చాలా చిన్నవాళ్ళంగానే కదా ఉన్నాము. ఆత్మ పరమాత్మల జ్ఞానం కానీ, భక్తి కానీ, మనం చిన్నపిల్లలవలెనే ఉన్నాము. వాటిని గూర్చిన జ్ఞానం మనకు బొత్తిగా తక్కువ. అందువల్ల చిన్న పిల్లల వలె, మనకు మన హితం కోసం మనకు కలిగిన ఈ సంసార బాధ తీరడం కోసం ఏమి చేయాలో మనకు తెలియదు. తెలిసినా, ప్రతిక్రియ చేసుకోగలిగిన శక్తి కూడా మనకు లేదు. ఇక ఏమి చేయగలం అంటే, ఏడవడం ద్వారా, మన బాధను మనం తెలిసిన భాషతో వ్యక్తం చేయడం ద్వారా ఇంకొకరికి చెప్పగలం, అంతే. ఎవరితో చెప్పగలం? అంటే, మనకు సమీపంలో ఉండే భగవద్భక్తులతో, ఆచార్యులతో, భగవంతునితో మన బాధను గూర్చి చెప్పుకోగలం. అది కూడా, ఏడవడం ద్వారా కావచ్చు, లేక, వేరొక రీతిలో కావచ్చు. స్తోత్రం ద్వారా కావచ్చు. భజనలు చేయడం ద్వారా కావచ్చు, పాటను పాడడం ద్వారా కావచ్చు, ఈ విధంగా అనేక విధాలుగా మనఃస్థితి ఏమి? మన బాధ ఏమి? అనే సంగతిని తెలియజేయగలం.

అయితే, మనం బాధను స్పష్టంగా వ్యక్తం చేయలేము– అనే ఉద్దేశ్యంతోనే మనకోసం మహర్షులు, ఆళ్వారులు, మన పూర్వాచార్యులు స్తోత్రాలను అనుగ్రహించారు. అవి మన కోసమే అనుగ్రహించారు. మన బాధను మనం స్పష్టంగా చేయలేము అనే ఉద్దేశంతోనే, మనకోసమే, వాటిని అనుగ్రహించారు. ఆ స్తోత్రాలలో, పాటలలో, మనం పడే బాధలను గూర్చి కష్టనష్టాలను గూర్చి తెలియజేసేవిగా ఉంటాయి. వాస్తవానికి, వాటి అర్థం కూడా మనకు స్పష్టంగా తెలియదు. ఏ విధంగా అంటే,, చిన్న బిడ్డకు ఏడవడం తెలుసు తప్ప తాను ఏడ్చే ఏడుపులోని అర్థం కూడా తెలియనట్లే. తాను ఆకలి కోసం ఏడుస్తుందో, దెబ్బ తగిలి ఏడుస్తుందో, లేక, ఇంకొక కారణం వల్ల ఏడుస్తున్నదో, దానికి తెలియదు కదా. ఆ కారణాలను తల్లి తెలుసుకోవాలి, తెలియగలదు కూడా. ఆ విధంగానే, ఈ స్తోత్రాలలో మనకు కలిగే బాధ, కష్టం, నష్టం మొదలైనవి అన్నీ ఉంటాయి. వీటిని మనం అనుసంధానం చేయడమే మన బాధను భగవంతుని సన్నిధానంలో, పెద్దల సన్నిధిలో, ఆచార్యుల సన్నిధిలో మన కష్టాలను ప్రకటించడంవంటిది.. చిన్న బిడ్డకు తన బాధను తెలుపడానికి ఏడుపు ఏ విధంగా ఒక భాష అవుతున్నదో, తన మనసులోని అభిప్రాయాన్ని వ్యక్తం చేయడానికి సాధనం అవుతున్నదో, ఆ విధంగానే, ఈ స్తోత్రాలు కూడా మనకు కలిగే బాధను వ్యక్తం చేయడానికి ఒక సాధనం, ఒక భాష అవుతున్నది. బిడ్డ ఏడ్చినప్పుడు, తల్లికి –"ఈ బిడ్డకు ఆకలి అయ్యే సమయం ఇది, బిడ్డకు నిద్ర వచ్చే సమయం ఇది, బాధ కలిగిన సమయం ఇది" అని తెలుసుకొని దానికి నివారణోపాయాన్ని చేస్తుంది. ఆ విధంగానే, మనం పెద్దలు మనకు

అనుగ్రహించిన స్తోత్రాలను అనుసంధానం చేయగా చేయగా, భాగవతులు, ఆళ్వారులు, ఆచార్యులు, భగవంతుడు మనకు కలిగిన బాధ ఏమో తెలుసుకుంటారు. దానికి తగిన నివారణను చేస్తారు. అందుకోసమే, మనం ఈ స్తోత్రానుసంధానాన్ని చేస్తాము.

అందువల్ల, మనకు అర్థం తెలియని ఈ స్తోత్రాలను చెబుతున్నామే! దీనివల్ల ఏమి ప్రయోజనం? అని అనుకోకూడదు. వీటివల్ల తప్పక మంచి ప్రయోజనం కలుగుతుంది. బిడ్డకు, ఏడుపులోని అర్థం తెలియకపోయినా, ఏడిస్తే తల్లి దాని బాధ ఏమిటో గమనించి, దానికి తగిన నివారణను చేసేటట్లే, మనకు అర్థం తెలియకపోయినా, స్తోత్రాలను అనుసంధానం చేస్తే, ఆచార్యులు, భాగవతులు, ఆళ్వారులు ,భగవానుడు మన కష్టమేమో గుర్తించి దానికి తగిన ప్రతిక్రియను తప్పక చేస్తారు. మన బాధను వ్యక్తం చేయడానికి మనకు తెలిసిన భాష ఇది ఒక్కటే. దీనిని మనం చెప్పినట్లయితే, మన బాధను పెద్దలు గుర్తించి, మనకు తగిన నివారణను కలిగిస్తారు.

అందువల్ల మహర్షులు, ఆళ్వార్లు, పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రాలను భక్తితో అనుసంధానం చేద్దాం. వారి అనుగ్రహాన్ని పొందుతాం. స్వస్తి.

★★★★★

# 16. పురుషోత్తమశబ్దార్థమ్

భగవంతునకు కల అనేక నామాలలో పురుషోత్తమ నామం ఒకటి. ఈ నామంలోని అర్థాలను గమనించినప్పుడు, ఎంతటి లోతైన తత్త్వాలను ఈ నామం ఆవిష్కరిస్తున్నదో తెలిస్తే, మనకు ఆశ్చర్యం అవుతుంది.

పురుష శబ్దం కేవలం మగవారిని బోధించదు. జ్ఞానాన్ని కలిగిన ఆత్మలను అందరినీ తెలియజేస్తుంది. ఆత్మలు మూడు విధాలుగా ఉంటారు. బద్ధులు, నిత్యులు, ముక్తులు అని ఆత్మలు మూడు విధాలు. ఇంకా ఈ సంసారం లోనే ఉండి, జన్మం మరణ పరంపరలో మునిగి ఉండి, బాధలను పడేవారు, సుఖదుఃఖాలను అనుభవించేవారు బద్ధులు అనబడతారు. ఏదో ఒకనాడు, భగవంతుని నిరుపాధికమైన అనుగ్రహాన్ని పొంది, ఈ సంసార బంధం నుండి విడివడి పరమపదాన్ని చేరి, భగవంతునకు నిత్యకైంకర్యం చేసుకునేవారు ముక్తులు. ఇక, మూడవ వర్గం వారు నిత్యులు. వీరు ఏనాడు సంసార సంబంధాన్ని లేనివార. ఎల్లప్పుడూ పరమపదంలో భగవంతుని అనుభవాన్ని పొందుతూ ఆ స్వామికి సేవలు చేసుకోగలిగే భాగ్యాన్ని కలిగిన వారు. వారు, ఆదిశేషుడు, గరుడుడు, విష్వక్సేనుడువంటివారు. ఈ విధంగా జీవులు మూడు విధాలుగా ఉంటారు.

ఇటువంటి జీవులకంటే భగవంతుడు ఉన్నతుడు, ఉత్తముడు, వేరైనవాడు. మూడు విధాలుగా ఉండే ఈ జీవుల కంటే తక్కువగా ఉండేవి జడ వస్తువులు. ఈ జీవులు, జడ ప్రకృతి అంతా భగవంతుని సొత్తే. మన శరీరంతో పాటుగా, ఈ లోకంలో కనిపించే అన్ని వస్తువులు జడ పదార్థాలు. ఇవి అచిత్తు అని అనబడుతున్నాయి. తత్త్వాలు మూడు, అచిత్తు, చిత్తు, ఈశ్వరుడు అని తత్త్వాలు మూడు విధాలుగా ఉంటాయి అని మనకు తెలుసు. జ్ఞానం లేనిది అచిత్, జ్ఞానాన్ని కలిగినది చిత్తు, ఈ రెండిటి కంటే ఉన్నతుడు పరమాత్మ.

ఈ విధంగా, జ్ఞానం లేని జడ వస్తువుల కంటే, జీవులు ఉన్నతులు. ఎందుకంటే, వారు జ్ఞానం కలిగిన వారు కదా. ఇదే కాక ,జీవులు నిత్యులు నాశం లేనివారు. జడ వస్తువులు ప్రతిక్షణం మార్పును పొందుతాయి కదా. అందువల్ల స్వరూపంఏ విధంగానూ ఏ సమయంలోనో మార్పు లేని జీవులు జడ వస్తువుల కంటే ఉన్నతులు. జ్ఞానం కలిగి ఉన్నందున, ఏనాడు నాం లేనందున, స్వరూపంలో ఏ విధమైన మార్పు లేనందున, చిత్ అనే

శబ్దం చేత చెప్పబడే జీవులు– జ్ఞానం లేనందున, స్వరూపంలో నిత్యం మార్పును పొందుతున్నందున, అచిత్ అనే శబ్దం చేత చెప్పబడే జడపదార్థాలు అధమమైనవి.

ఇటువంటి జీవాత్మలకంటే పరమాత్మ ఉన్నతుడు. ఎందువల్ల అంటే , ఈ చేతనా చేతన పదార్థాలను అన్నిటినీ అతడు ధరిస్తున్నందున, అన్నిటిలోనూ ఏ లోటు లేకుండా వ్యాపించి ఉన్నందున, అన్నిటినీ సొత్తుగా కలిగిన స్వామియే వాటిని నియమించేవాడై ఉన్నందున అందువల్ల పరమాత్మకు ఔన్నత్యం ఉన్నది.

ఈ అర్థాలన్నీ పురుషోత్తమ శబ్దంలో అంతర్భవించి ఉన్నాయి. పురుషోత్తమః అనే ఈ ఒక్క శబ్దంలోనే ఇన్ని అర్థాలు పొదగబడి ఉన్నాయి. ఈ పురుషోత్తమ శబ్దంలో నామంలో , పురుషః, ఉత్తమ – అని రెండు పదాలు ఉన్నాయి. ఇందులో, మొదటి పదం పురుష అనే పదం. పురుష శబ్దానికి జ్ఞానం కలిగినవాడు అని అర్థం. అందువల్ల పురుషః అని అనగానే, అచిత్తు కంటే భిన్నమైనవాడు అని తెలుస్తుంది. అందువల్ల భగవంతుని పురుషుడని అంటే, జడ పదార్థాల కంటే వేరయినవాడు అని చెప్పినట్లు అవుతుంది.

వెంటనే మనకు ఒక సందేహం ఇక్కడ కలుగుతుంది. పరమాత్మ ఒక్కడే జడ పదార్థాల కంటే వేరైనవాడా?, అది కూడా మనం కూడా జడ వస్తువుల కంటే అధికులమే కదా? అనే సందేహం కలుగుతుంది. అందువల్లనే ఉత్తమ శబ్దం ఈ నామంలో చేర్చబడింది.

ఈ ఉత్తమ శబ్దాన్ని మూడు విధాలుగా విభాగం చేసి గ్రహించాలి. ఏ విధంగా అంటే –ఉత్పురుషః, ఉత్తర పురుషః, ఉత్తమ పురుషః అని మూడు విధాలుగా విభాగం చేసి గ్రహించాలి .ఉత్పురుషః అంటే, ఈ లోకంలో ఉండే బద్ధాత్ములకంటే వేరైనవాడు, అధికుడు " అని అర్థం. ఎందుకంటే, కర్మలు బద్ధాత్ములను బంధించినట్లుగా,, పరమాత్మను బంధించవు, " న మే కర్మాణి లింపంతి" అని అన్నాడు కదా, గీతాచార్యుడు. ఇక్కడ ఉత్ అనే పదానికి ఉన్నతమైన వాడు అని అర్థం. అందువల్ల ఉత్పురుష శబ్దానికి బద్ధాత్మల కంటే ఉన్నతుడు అని అర్థం.

తరువాతి పదం –ఉత్తర పురుషః అనేది. భగవంతుడు బద్ధాత్మలకంటే ఉన్నతుడు అని అంటే, ముక్తులు కూడా బద్ధాత్ముల కంటే ఉన్నటులే కదా! మరి, భగవంతునకు గల గొప్పతనం ఏమి? వారికి కూడా కర్మ సంబంధం అనేది లేదు కదా'కర్మల వల్ల వారికి ఏ విధమైన బాధ కలుగదు కదా. భగవంతుడు కూడా అంత మాత్రమేనా? అని అంటే, భగవంతుడు ఉత్తర పురుషుడు, అంటే, ఉత్పురుషుని కంటే ఉన్నతుడు. ముక్తుల

కంటే ఉన్నతుడు. ఏ విధంగా అంటే, ముక్తులు భగవదనుగ్రహాన్ని పొంది పరమపదాన్ని చేరడానికి ముందు సంసారంతో సంబంధం ఉన్నవారే కదా. ఎన్నో జన్మలు ఈ సంసారంలో పొందిన తరువాతనే కదా ముక్తిని పొందారు. భగవంతునకు ఆ విధంగా ఏనాడు కర్మమూలకంగా ఉండే జన్మలు లేవు కదా. కర్మమూలంగా అతడు ఏనాడు జన్మించలేదు. విధంగా ఉత్పురుషుడైన ముక్తుని కంటే భగవంతుడు ఉన్నతుడు కనుక ఉత్తర పురుషుడు అయ్యాడు.

ఇప్పుడు, మళ్లీ ఇంకొక సందేహం వస్తుంది, భగవంతునకుకూఖడ ఏనాడు సంసారంతో సంబంధం లేకుండా ఉండేటట్లు కూడా ఏనాడు సంసారంతో సంబంధం లేదు కదా మరి ఏ కంటే భగవంతునికి ఉన్నది వైలక్షణ్యం ఉన్నది భగవంతునికి ఉండే గొప్పతనం అంత మాత్రమేనా? అనే సందేహం కలుగవచ్చు. నిత్యులు ఏనాడు సంసార సంబంధం లేనివారు అయినప్పటికీ, భగవంతుని అనుగ్రహం వల్ల జ్ఞానాన్ని పొందినకవారు. వారి నిత్యత్వం కూడా భగవంతుని సంకల్పం వల్లనే సిద్ధించింది సిద్ధించింది. సహజంగా కాదు కానీ !భగవంతుని జ్ఞానం కానీ నిత్యత్వం కానీ ఇంకొకరిపై ఆధారపడినవి కాదు అవి ఆయన పైననే ఆధారపడి ఉన్నాయి. అతడు ఎవరి అధీనంలోనూ లేడు ఎవరికీ దాసుడు కాడు. ఆ స్వామిని నియమించే వేరొక స్వామి ఎవ్వరూ లేరు. అందువల్లనే భగవంతుడు నిత్యులకంటే కూడా ఉన్న తుడుగా, ఉత్తముడు అధఝుచెప్పబడుతున్నాడు. అందువల్ల ఉత్తమ పురుషుడు అయ్యాడు.

ఈ విధంగా పురుషశబ్దం చేత జడ పదార్థాల కంటే భిన్నత్వం ఉత్పురుషుడు అని అన్నందున సంసారంలో ఉండే బద్ధాత్ముల కంటే వైలక్షణ్యం, ఉత్తర పురుషః అనితర అన్నందున ముక్తుల కంటే వైలక్షణ్యం ఉత్తమ పురుషః అనే అన్నందున నిత్యుల కంటే వైలక్షణ్యం. అందువల్లనే భగవంతుడు పురుషోత్తముడు అయ్యాడు పురుషోత్తమ నామంచేత చెప్పబడుతున్నాడు.

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ 15వ అధ్యాయంలో పూర్తిగా ఈ పురుషోత్తమ విద్యనే "అతోఽ స్మి వేదే లొకే చ ప్రథితః పురుషోత్తమః " నేనే ఈ లోకంలో వేదంలో కూడా పురుషోత్తముడునుగా ప్రసిద్ధుడను అయ్యాను– అని అంటూ ఉపదేశించాడు.

ఈ విధంగా భగవంతుని తిరునామాలు అన్నీ చాలా గంభీరమైన అర్థాలను కలిగి ఉంటాయి. వాటిని మనం పెద్దల ద్వారా గ్రహించి, అనుసంధానం చేసుకొందాం. స్వస్తి.

# 17. శరణాగతునిలో భగవంతుడు ఏమి ఆశిస్తాడు?

శ్రీరామాయణంలో మనకు అందరికీ తెలిసిన వృత్తాంతం ఒకటి. రావణుని తమ్ముడు విభీషణుడు సముద్రతీరానికి వచ్చాడు. "నేను నీ శరణు కోరి వచ్చాను, నన్ను అనుగ్రహించు" అని శ్రీరాముని ప్రార్థించాడు. " విభీషణుని అంగీకరించకూడదు" అని సుగ్రీవుడు మొదలైనవారు చాలా బలంగా వ్యతిరేకంగా వాదించారు. కానీ, శ్రీరాముడు తన కాలిపై పడి, తనను శరణు కోరినవాడు ఎటువంటి వాడైనా సరే, అతనిని కాదనను, కాదనలేను. "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన". వచ్చినవాడు దోషాలను కలిగిన వాడు కానీ, లేనివాడు కానీ, ఎటువంటివాడైనా సరే, నేను విడవను. అతడు వాస్తవంగా మిత్రభావాన్ని కలిగినవాడు కాకపోయినా, ఆ భావాన్ని తనలో ఆరోపించుకొని వచ్చినా, మనసులో ఒక భావాన్ని కలిగినవాడై, మాటలో వేరొక భావాన్ని వ్యక్తం చేసేవాడు అయినప్పటికీ, నేను అతనిని విడిచిపెట్టను. స్నేహితుని వేషం వేసుకొని వచ్చినా విడిచిపెట్టను" అని అన్నాడు. తన వద్దకు శరణు కోరి వచ్చినవాని విషయంలో భగవంతుడు అంతటి అవధిలో అనుకూల్యాన్ని కలిగి ఉంటాడు. అతనిలో ఏమీ ఆశించడు.

అదేమి? భగవానుడు శరణాగతునిలో ఏదైనా కొంచెం ఆశించవచ్చు కదా? అని అంటే, శరణాగతనిలో ఒక విషయాన్ని మాత్రం ఎదురు చూస్తాడు. అది ఏమి ?అంటే, ఆశను, భగవంతుని ఆశ్రయించాలి అనే ఆశను ఎదురు చూస్తాడు. భగవంతుని విషయంలో ఆభిముఖ్యాన్ని ఎదురు చూస్తాడు. అది ఉంటే చాలు, భగవంతుడు చాలా తృప్తి పడతాడు. అంతకు మించి ఏమీ ఆశించడు.

ఆ విధంగా అంత మాత్రమే ఆశించడం ఎందుకు? అంతకు మించి దేనినైనా ఎదురు చూస్తే ఏమి? అని అంటే– ఒక్కడు మన దగ్గరకు సహాయం కోరి వస్తాడు అనుకోండి. " నీ దగ్గర ఈ విషయం ఉంటే సహాయం చేస్తాను, ఈ విషయం ఉంటేనే చేస్తాను, లేకపోతే సహాయం చేయను" అని మనం కొన్ని నియమాలు పెట్టాలా? ఆ విధంగా కొన్ని నియమాలను మనం విధించినట్లయితే, మనం చేసేది సహాయం అవుతుందా? అతని దగ్గర లేనిదానిని ఆశించి, ఇవ్వమని అడిగితే, ఆ విధంగా అతడు లేనిదానిని ఇవ్వడం ఎలా సాధ్యం అవుతుంది? ఒకవేళ, ఆ విధంగా ఒక విషయాన్ని ఆశించి దానిని పొంది, నేను సహాయం చేస్తే, అది సహాయం అవుతుందా ? ఎంత మాత్రం కాబోదు.

శరణాగతిని కోరి వచ్చినవాని దగ్గర ఉన్నదే చాలా అల్పం. అంతకు మించి లేని దానిని ఆశిస్తే? భగవంతుడు శరణు కోరిన మనలను చూచి " నీలో ఈ గుణాలు ఉన్నాయా ?ఈ గుణాలు ఉన్నాయా? భక్తి యోగం ఉన్నదా? కర్మయోగం ఉన్నదా? జ్ఞాన యోగం

ఉన్నదా? అనే మనలను అడిగితే, మనం ఏమి చేయాలి? లేనిదానిని ఎక్కడ నుండి తీసుకుని వచ్చి ఇవ్వాలి? ఎక్కడికి వెళ్లాలి?

అందువల్లనే, శ్రీరాముడు "సుగ్రీవా! ఈ విభీషణునిలో లేనిదానిని నేను ఇమ్మని అంటే, అతడు ఏమి చేస్తాడు? ఏ విధంగా లేనిదానిని తీసుకొని వచ్చి నాకు ఇవ్వగలడు? నేను అతనిని ఏ విధంగా ఆ రీతిలో అడుగగలను? లేనిదానిని నేను అడిగినట్లయితే, నేను సులభంగా పొందడానికి శరణాగతిని చేయడానికి సాధ్యం కానివాడను అవుతాను కదా. శరణాగతి కోరి వచ్చిన వానిలో శ్రీరాముడు ఏమేమో ఆశిస్తాడు, ఏదేదో కోరుతాడు, అతడు సులభంగా పొందడానికి సాధ్యం అయినవాడు కాడు –అని అవుతుంది కదా. ఇక, నన్ను శరణాగతిని చేయడం కోసం ఎవరు వస్తారు?అందువల్ల శరణాగతి కోరి వచ్చిన వానిలో నేను నన్ను ఆశ్రయించాలి అనే ఆశను తప్ప వేరొక విషయాన్ని దేనిని కోరను, ఆశించను. అతని దగ్గర ఉన్నదానిని ఆదరంతో సమర్పించనీ. దానితో నేను తృప్తి పడతాను. ఒకవేళ, ఏమీ లేకపోతే," నా దగ్గర ఏమీ లేదు "అని చెప్పి ఆశ్రయించనీ. చాలు. వాస్తవాన్ని అంగీకరించి, నన్ను ఆశ్రయిస్తే చాలు, తృప్తి పడతాను, "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయమ్" అని అన్నాడు.

సరే భగవంతుడు మన దగ్గర ఏమీ ఆశించడం లేదు. ఆశించనివాడు అయినప్పుడు, "మిత్రభావంతో వచ్చినప్పటికీ చాలు" అని అనడం ఎందుకు? ఆ విధంగా అనడం కూడా మానివేయవచ్చు కదా! "ఏమీ అక్కరలేదు, ఏమీ లేకపోయినా నేను అనుగ్రహిస్తాను– అని అనవచ్చు కదా" అని అంటే, భగవంతుడు ఆ విధంగా అనడు. ఆశ్రయించాలనే ఆశ ఉండాలనే ఆశిస్తాడు. ఒకడు, భగవంతుడే లేడని అనేవాడు ఉన్నాడనుకోండి. అతనికి భగవంతుడు ముక్తి ఇస్తాడా ? అని అంటే, ఇవ్వవచ్చు. కానీ, భగవంతుడు అతనికి ముక్తిని ఇచ్చినప్పటికీ, భగవంతుడు లేడనేవాడు ఆ ముక్తిని గ్రహించడానికి, స్వీకరించడానికి ఏ విధంగా సిద్ధపడతాడు? భగవంతుడు ఉన్నాడనే విషయంలో అతడు నమ్మకమే లేకుండా ఉన్నాడు కదా. అందువల్ల భగవంతుడు అతనికి ముక్తిని ఇచ్చినా, అతడు స్వీకరించి అవకాశం లేదు. కనీసం "భగవంతుడు ముక్తిని ఇస్తే దానిని నేను గ్రహిస్తాను" అని అంత మాత్రమైనా చెప్పాలి కదా.. ఆ ఆశనే శ్రీరాముడు ఎదురు చూశాడు.

శ్రీరాముని దగ్గరకు శరణ కోరి వచ్చిన విభీషణునిలో ఏ విధమైన గుణం లేదు. నిండుగా దోషాలు ఉన్నాయి. కానీ, అతనిలో "తనను శ్రీరాముడు తప్పక అంగీకరిస్తాడు, విడిచిపెట్టడు", అనే నమ్మకం దృఢంగా ఉన్నది." శ్రీరాముని ఆశ్రయించాలి "అనే ఆశ

బలంగా ఉన్నది. దానిని చూచే శ్రీరాముడు ఆ విభీషణుని అనుగ్రహించాడు తప్ప, అతనిలో ఏమి గుణాలు ఉన్నాయి? ఏమి యోగ్యత ఉన్నది? అని పరిశీలించి కాదు. ఆ విధంగా ఎదురుచూచేవాడు కాదు, శ్రీరాముడు. విభీషణునిలో ఆశ కంటే వేరయిన దానిని దేనినైనా ఆశించి ఎదురుచూస్తే, అది విభీషణునిలో ఏమీ లభించదు.. అప్పుడు విభీషణని శ్రీరాముడు విడిచి పెట్టవలసిందే. తన పాదాలపై పడినవానిని కూడా విడచి పెట్టవలసిందే. ఆశ కూడా అక్కరలేదు– అని శ్రీరాముడు భావించవచ్చు కదా! అని అంటే, అప్పుడు తాను ఇచ్చే అభయం ఎదుటి వ్యక్తికి రుచించదుకదా.

ఒక గొప్ప దాత ఉన్నాడనుకోండి, అతడు అందరికీ ఎవరు ఏమి కోరినా ఇస్తాడు. ఒకడు అతని దగ్గరకు "అతడు నేను అడిగినదా అనేది ఇస్తాడు " అనే నమ్మకంతో ,ఆశతో వెళ్లినప్పుడే అతడు ఇవ్వడానికి సాధ్యం అవుతుంది. తినాలనే ఆకలి ఉన్నప్పుడే, పెట్టే అన్నను రుచిస్తుంది. ఎంత గొప్ప దాత అయినప్పటికీ, ఆకలి లేనివానికి ఒకనికి అన్నం పెడితే పెట్టవచ్చు కానీ, ఆకలి లేని వానికి అన్నం, ఎంత రుచికరమైనది అయినప్పటికీ రుచించదు కదా.

ఆ విధంగానే, " భగవంతుని ఆశ్రయించాలి " అనే ఆశ అనేది అన్నం తినాలనే ఆశ వంటిదే. ఈ ఆశకు మించి ఏదైనా ఉండాలని భగవానుడు ఎదురు చూస్తే, అన్నం కోరి అన్నం తినాలనే ఆశతో వచ్చేవాని దగ్గర అన్నం తినాలనే ఆశ తప్ప వేరొకటి ఏమీ ఉండదు. ఆ విధంగానే, తనను ఆశ్రయించాలని కోరి వచ్చిన విభీషణునిలో ఆ ఆశ తప్ప వేరొకటి ఏమి శ్రీరామునకు లభించదు. అందువల్లనే "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన " అని శ్రీరాముడు సుగ్రీవుని ఉద్దేశించి అన్నాడు. " స్నేహితుని వేషంలో వచ్చినప్పటికీ చాలు, నేను అతనిని కూడా విడచిపెట్టను, స్వీకరిస్తాను" అని అన్నాడు. అందువల్ల శరణాగతి కోరి వచ్చినవానిని భగవానుడు ఏనాడు విడచి పెట్టడు. తనను ఆశ్రయించాలనే ఆశను తప్ప వేరొకటి దేనిని అతడు ఆశించడు.

ఇందువల్లనే శ్రీ రామానుజులు కూడా "ఆశై యుడైయోర్ క్కెల్లామ్ కూరుమ్" – ఆశను కలిగినవారికి అందరికీ ఉపదేశించండి –అని అన్నారు.



# 18. శ్రీరామాయణమ్, మహాభారతమ్, శ్రీమద్భాగవతమ్

శ్రీరామాయణం ,మహాభారతం, శ్రీమద్భాగవతం అనే ఈ మూడు చాలా ప్రసిద్ధమైనవి. కొంతమందికి ఈ మూడిటిలో ఒక్కొక్కటి రుచించవచ్చు, మరికొంతమందికి ఈ మూడు ఇష్టపడవచ్చు. ఈ మూడిటి మధ్య ఉండే సామ్యాలు, వైలక్షణ్యాలు అనే వీటిని గమనిస్తే, చాలా ఆశ్చర్యం కలుగుతుంది.

సీతా వైభవాన్ని వర్ణించడం కోసం ప్రవర్తించినది శ్రీరామాయణం. దీని పేరే రామాయణం. శ్రీరామాయణంలోని ప్రతీ కాండలోనూ సీతాదేవి వైభవం ప్రతిపాదింపబడడం స్పష్టంగా గమనించవచ్చు. వాల్మీకి కూడా శ్రీరామాయణాన్ని ఉద్దేశించి పలుకుతూ "సీతాయాః చరితం మహత్" – సీతాదేవి యొక్క గొప్ప చరిత్ర– అని అన్నాడు.

పాండవులకు దూతగా పోయినవాడు శ్రీకృష్ణుడు. గీతను ఉపదేశించినవాడు కృష్ణుడు. అర్జుననకు సారథిగా సారథ్యాన్ని చేసినవాడు శ్రీకృష్ణుడు అటువంటి శ్రీకృష్ణుని వైభవాన్ని తెలియజేస్తున్నది మహాభారతం.

ఇక, శ్రీమద్భాగవతం అనేది భాగవతులైన భగవద్భక్తుల వైభవాన్ని ప్రతిపాదించేది. సత్సంగ మహిమ, భాగవతుల శ్రీపాద ధూళి మహిమ మొదలైనవి అన్ని ఈ పురాణంలో తెలియజేయబడ్డాయి. భాగవతులంటే భగవంతునకు చెందినవారే కదా. వారి వైభవాన్ని తెలియజేయడం కోసం వచ్చినదే శ్రీమద్భాగవతం.

శ్రీరామాయణం త్రేతాయుగానికి సంబంధించినది. ఆయుగానికి సంబంధించిన చరిత్ర, ఆ యుగంలో జీవించిన వారి విశేషాలు మొదలైనవి ఆ ఇతిహాసం వల్ల తెలుస్తాయి. మహాభారతం ద్వాపర యుగానికి సంబంధించింది. ఆ యుగం చివరిలోనే మహాభారత కథ జరిగింది .ఇక, శ్రీమద్భాగవతం అన్నియుగాలకు సంబంధించిన వృత్తాంతాలను తెలుపుతుంది. అయినప్పటికీ, ఆ పురాణం కలియుగం కోసమే ఆవిర్భవించింది. శ్రీకృష్ణుడు తన అవతారాన్ని చాలించేటప్పుడు "నేను శ్రీమద్భాగవత పురాణంలో ఉంటాను. ఎవరు ఆ మహాపురాణాన్ని పారాయణను చేస్తారో, వారు నాకు దగ్గర అవుతారు". అని అన్నాడు. అందువల్ల ప్రధానంగా కలియుగం కోసం ఆవిర్భవించినది శ్రీమద్భాగవతం. ఈ విధంగా త్రేతా గం, ద్వాపర యుగం,, కలియుగం అనే ఈ మూడు యుగాల కోసం ఏర్పడినవి శ్రీరామాయణం, మహాభారతం, శ్రీమద్భాగవతం అనే మూడు. ఈ మూడు కాలగర్భంలో

కలిసిపోకుండా, ఏనాటికి నిలువగలిగినవి, నిలిచి ఉండేవి. ప్రతి యుగంలోని మన భారతదేశ వైభవాన్ని తెలియజేసేవి– అనే ఈ కోణంలో కూడా ఈ మూడిటి వైభవాన్ని గమనించవచ్చు.

ఇంకొక విషయం. లవకుశులు పాడినది శ్రీరామాయణం. అందులో పాటకు ప్రాధాన్యం. బాలకాండ ఆరంభంలోనే "తంత్రీలయ సమన్వితమ్" అని ఏడు స్వరాలలో కూర్చబడి, విలంబిత, ద్రుత , మధ్యమ అనే మూడు భేదాలలో శ్రీరామాయణం లవకుశులచేత గానం చేయబడింది. అందుచేత గాన రూపంగా ఉండేది శ్రీ రామాయణం. మహాభారతం ఉపదేశరూపంలో ఉండేది. అందులో పాటకు, గానానికి స్థానం లేదు. భగవద్గీత గీత అనే పేరు ఉన్నది కానీ, అది ఉపదేశరూపమైనది. ఇక, ఆ భాగవతాన్ని చూసినట్లయితే, అదిగానరూపమైనదిగా కానీ, ఉపదేశరూపమైనదిగా కానీ కాకుండా, పారాయణకు ప్రాధాన్యం కలిగినది. లోకంలో భాగవత పారాయణాలు సప్తాహ పారాయణాలు ప్రసిద్ధమైనవి. చాలాచోట్ల జరుగుతాయి. ఈ విధంగా శ్రీరామాయణం మహాభారతం, శ్రీమద్భాగవతం, అనేవి పాట, ఉపదేశం, పారాయణ అనే వీటిని ప్రధానంగా కలిగినవి. ఈ కోణంలో కూడా ఈ మూడిటిని గమనించవచ్చు.

ఒకే అవతారాన్ని ,అంటే, శ్రీరామావతారాన్ని గూర్చి ప్రధానంగా పలికినది శ్రీరామాయణం. అందులో మొదటి నుండి చివరి వరకు ఆ అవతారాన్ని గూర్చిన వృత్తాంతమే కనిపిస్తుంది. కానీ మహాభారతం ఆ విధంగా కాదు. "నారాయణ కథామిమామ్" అని శ్రీకృష్ణావతారాన్ని గూర్చి చెప్పడానికి ఆరంభించినప్పటికీ, మహాభారతంలో అక్కడక్కడ ఎన్నో అవతారాలను గూర్చిన ప్రస్తావనలు కనిపిస్తాయి. శ్రీమద్భాగవతంలో అయితే, ప్రారంభం నుండే ",భగవంతుని పలు అవతారాలను తెలియజేస్తాను" అని ఆ పురాణం ఆరంభం అవుతుంది. ఈ కోణంలో కూడా ఈ మూడిటిని దర్శించవచ్చు.

మరొక విషయం. శ్రీరామాయణాన్ని వాల్మీకి మహర్షి తానుగా ఎవరికీ పాడి వినిపించలేదు. లవకుశుల మూలంగానే ఆ ఇతిహాసాన్ని లోకంలో ప్రచారం అయ్యేటట్లు చేశాడు. మహాభారతాన్ని వ్యాసుడు రచించాడు కానీ, తరువాత దానిని వైశంపాయనుడు జనమేజయునకు ఉపదేశించగా, ఆ తరువాతనే అది లోకంలో ప్రచారాన్ని పొందింది. ఆ విధంగానే, భావగవతాన్ని కూడా వ్యాసమహర్షి రచించాడు. ఆ తరువాత దానిని వ్యాసుని కుమారుడైన శుకుడే పరీక్షిత్తుకు ఉపదేశించడం ప్రారంభించాడు. అప్పుడు దానిని రోమహర్షుడు విన్నాడు. ఆ తరువాత దానిని రోమహర్షుని కుమారుడైన సూత

పౌరాణికుడు శౌనకుడు మొదలైన వారికి ఉపదేశించగా,, ఆ తరువాత ఆ పురాణం లోకంలో ప్రసిద్ధిని పొందింది. ఈ విధంగా శ్రీరామాయణం, మహాభారతం, శ్రీభాగవతం ఈ మూడిటిని రచించినవారు ఎవరు కూడా లోకంలో ప్రచారాన్ని పొందించలేదు. వాటిని రచించినవారు తమ శిష్యులకు బోధించారు. ఆ తరువాత అది వారి ద్వారా లోకంలో ప్రచారాన్ని పొందినది. ఇది ఇంకొక సామ్యం.

ఈ విధంగా ఈ మూడిటి మధ్య కనిపించే సామ్యాలు వైలక్షణ్యాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. మొత్తంగా ఈ మూడు కూడా భారతీయ సంస్కృతికి, సంప్రదాయానికి మూల స్తంభాలు. మనం ఈ లోకంలో జీవించవలసిన జీవన విధానాన్ని మనకు ఉపదేశించేవి. ఇకపై మళ్లీ మనం జన్మను ఎత్తకుండా, భగవంతుని శ్రీచరణసాన్నిధ్యాన్ని పొందడానికి తగిన  మార్గాలను ఉపదేశించేవి. ఆ లోకంలో మనం పొందదగిన ఉత్తమ పురుషార్థాన్ని తెలియజేసేవి.

ఈ మూడిటిని  మనం పెద్దల సన్నిధిలో అధ్యయనం చేసి, వాటిలో తెలియదగిన సదర్థాలను ఉపదేశరూపంగా పొందుదాం, వాటిని నలుగురకు తెలియజేద్దాం స్వస్తి.

★★★★★

# 19. మహర్షులు– మన పూర్వాచార్యులు

వాల్మీకి మహర్షి, వేదవ్యాసమహర్షి వంటి పలువురు మహర్షులు ఇతిహాస పురాణాలను మనకు అందించారు. వారు కూడా మనకు ఆచార్యులు. వారి కాలానికి తరువాత కాలంలో అవతరించిన పూర్వాచార్యులు భగవద్రామానుజులు, వారికి ముందు అవతరించిన ఆళవందార్, నాథమునులు, తరువాత అవతరించిన కూరేశులు, వేదాంత దేశికులు, మణవాళ మహామునులు మొదలైన పూర్వాచార్యులు కూడా ఎన్నో స్తోత్రాలను అనుగ్రహించారు. పురాణ ఇతిహాసాలలో మనకు హితాన్ని తెలియజేసిన మహర్షుల క్రమానికి, స్తోత్రాలలో మంచిని అందించిన పూర్వాచార్యుల క్రమానికి మధ్యఒక విలక్షణమైన, గమనించదగిన తేడా ఉన్నది.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో కర్మయోగం, జ్ఞాన యోగం, భక్తియోగం, శరణాగతి మొదలైన ఉపాయాలను ఉపదేశించాడు. ఆ విధంగానే వీటిని వాల్మీకి కాని, వ్యాసుడు గకాని, శుకుడు కానీ, మరి ఏ మహర్షి కానీ ఇతిహాస పురాణాలలో నేరుగా ఉపదేశించారా? అని అంటే, ఆ విధంగా వారు ఉపదేశించరు. తాము తెలియజేయ గోరిన కథలను చెబుతూ, ఆ కథలలో వచ్చే కథా పాత్రల ద్వారా భక్తి యోగ జ్ఞాన యోగ కర్మయోగాదులను మనకు ఆచరించదగినవిగా ఉపదేశిస్తారు. ఆయా వ్యక్తులు ఆయా ఉపాయాలను ఆచరించి, ఆయా పలితాలను పొందారు– అని తెలియజేయడమే వారు చేసే పని. శరణాగతిని ఏవిధంగా చేయాలి ఆ శరణాగతిని చేస్తే ఏ విధమైన పఫలం వస్తుంది? ఎవరు చేయవచ్చు? ఏ విధంగా ఎప్పుడు చేయవచ్చు ?అనే ఈ వివరాలను అన్నిటినీ మహర్షులు నేరుగా తెలియజేయరు. ఆ విధంగా చెప్పే సందర్భాలు పురాణ ఇతిహాసాలలో చాలా చాలా తక్కువ. అయితే, వారు చేసేది ఏమంటే, ఎవరెవరు ఏ ఏ ఉపాయాలను ఏఏ సందర్భాలలో చేశారో, ఆ వివరాలను మాత్రం కథల ద్వారా వర్ణించి తెలుపుతారు. అంతటితో వారి కర్తవ్యం పూర్తి అవుతుంది. అక్కడక్కడ చాలా కొద్ది సందర్భాలలో మాత్రమే ఆ మహర్షులు నేరుగా చేసే ఉపదేశ వాక్యాలు మనకు కనబడతాయి.

కానీ, సంప్రదాయానికి సంబంధించిన పూర్వాచార్యులు మాత్రం మహర్షులు చెప్పినట్లుగా కథలను వర్ణించరు. అయితే, వారు శరణాగతి శాస్త్రాన్ని గూర్చి గాని, భక్తి శాస్త్రాన్ని గూర్చి గాని, అన్ని వివరాలను స్తోత్రాల ద్వారా తెలియజేస్తారు. అవి అన్నీ సాక్షాత్తుగా వారు తెలియజేసే మాటలు గానే ఉంటాయి. కథల ద్వారా కాదు. ఇది మహర్షులకు, పూర్వాచార్యులకు మధ్య ఉండే ఒక విలక్షణమైన తేడా.

అందువల్ల వేదవ్యాస మహర్షి శరణాగతిని గూర్చి నేరుగా ఉపదేశించారా? అని అంటే, ఆ మహర్షి భాగవతాన్ని రచించారు. ఆ భాగవతంలో గజేంద్రుని కథను వర్ణిస్తూ, గజేంద్రుడు భగవంతుని గురించి శరణాగతి చేశాడు అని తెలియజేస్తారు. భాగవతంలో దేవతలు అందరూ భగవంతుని తమను కాపాడమని శరణాగతి చేశారు అని తెలియజేస్తారు. శ్రీకృష్ణుడు కాళీయుని తలలపై నాట్యం చేసినప్పుడు అతని ధర్మపత్నులు శ్రీకృష్ణుని శరణు పొందినట్లు, దానివల్ల వారు తమ భర్తను రక్షించుకున్నట్లు తెలియజేస్తారు. తన గర్భంలో ఉండే శిశువును రక్షించమని ఉత్తర శ్రీకృష్ణుని శరణాగతి చేసినట్లు తెలియజేస్తారు." నాకు మానభంగం కలుగుతున్నది, నన్ను రక్షించ"మని ద్రౌపది శ్రీకృష్ణుని శరణాగతి చేసిన వృత్తాంతాన్ని వర్ణిస్తారు. ఇటువంటి కథలను అన్నిటిని వ్యాసుడు శ్రీభాగవతంలో వర్ణించి మనకు తెలియజేస్తారు. ఈ క్రమం భారతంలో, భాగవతంలో కనిపిస్తుంద. మహర్షులు ఆయా కథలను వర్ణిస్తారు తప్ప, నేరుగా శరణాగతి స్వరూపాన్ని పూర్వాచార్యులు స్తోత్రాలలో మనకు తెలియజేసినట్లుగా తెలియజేయరు. వారు మనకి అందించే క్రమం అంతా కథారూపంగానే ఉంటుంది. అది అంతా వారు చెప్పే ఉపదేశాలే అయినా, దానిని నేరుగా చెప్పరు. కథల ద్వారా, కథలలో పాత్రల ద్వారా తెలియజేస్తారు. ఇదే క్రమంలో శ్రీరామాయణంలో కూడా వాల్మీకి మహర్షి వర్ణిస్తారు. విభీషణుడు శరణాగతి చేసేటప్పుడు ఏ ఏ మాటలను చెప్పాడు, అప్పుడు సుగ్రీవుడు మొదలైనవారు ఏమని అన్నారు, చివరిగా శ్రీరాముడు తన నిర్ణయాన్ని ఏ విధంగా తెలియజేశాడు అని తెలియజేస్తారు తప్ప, వాల్మీకి నేరుగా శరణాగతిని ఉపదేశించా?రా అని అంటే, ఆ విధంగా ఉపదేశించినట్లు మనకు కనిపించదు.

ఈ లోటును మన పూర్వాచార్యులు పూర్తి చేశారు. ఈ ముఖ్యమైన కార్యాన్ని తాము తమ స్తోత్రాల ద్వారా, రహస్య గ్రంథాల ద్వారా నిర్వహించారు. అందుకోసమే రహస్య గ్రంథాలు ఆవిర్భవించాయి. శ్రీ పిళ్లైలోకాచార్యులవారు అష్టాదశ రహస్యాలు అని 18 రహస్య గ్రంథాలను మనకు అందించారు. ఎన్నెన్నో అపూర్వాలైన స్తోత్రాలను మనకు పూర్వాచార్యులు అందించారు. అష్ట శ్లోకీ అనే రహస్య త్రయాన్ని వివరించే స్తోత్రాన్ని భట్టర్ మనకు అనుగ్రహించారు. వేదాంతదేశికులు ఎన్నో స్తోత్రాలను, రహస్య గ్రంథాలను రచించారు. కూరేశుల పంచస్తవి, శ్రీ పరాశరభట్టర్ రచించిన శ్రీరంగరాజస్తవం పూర్వ శతక ఉత్తర శతకాలు, శ్రీ గుణ రత్న కోశం, భగవద్యామునుల స్తోత్ర రత్నం చతుఃశ్లోకి మొదలైన పూర్వాచార్య స్తోత్రాలలో ఇటువంటి ఉపదేశాలు మనకు కనిపిస్తాయి. వీటిలో పూర్వాచార్యులు విభీషణుడు శరణాగతి చేసినట్లుగా, ద్రౌపది శరణాగతి చేసినట్లుగా పలికి

ఆ తరువాత ఆ శరణాగతి స్వరూపాన్ని వర్ణించి మనకు ఉపదేశిస్తారు. ఇటువంటి రీతిలో ఉపదేశాలు, వివరాలు మనకు మహర్షుల ఇతిహాస పురాణాలలో కనిపించవు. వారు వర్ణించే వృత్తాంతాలలో జరిగిన సంభవాలే మనకు గోచరిస్తాయి. ఈ వృత్తాంతాలను మన పూర్వాచార్యులు వర్ణించరు. వారు అనుగ్రహించే స్తోత్రాలలో కథాభాగం చాలా అల్పం గా ఉంటుంది. వారి ఉపదేశాలే అధికంగా ఉంటాయి. వివరణలు విస్తృతంగా ఉంటాయి. ఇతిహాస పురాణాలలో అటువంటి ఉపదేశాలు, వివరణలు తక్కువగా ఉంటాయి. కథ అయితే విస్తృతంగా ఉంటుంది.

ఈ విధంగా మహోదారులైన మహర్షులు, పూర్వాచార్యులు తమ తమ కర్తవ్యాలను వేరువేరు రీతులలో నిర్వహించి, మనకు మహోపకారాలను చేశారు. తమ కర్తవ్యాలను విభాగించుకొని, వానిని వేరువేరు రీతులలో నిర్వహించారు. మనకు హితాన్ని ఉపదేశించారు. ఈ విధంగా రెండు రీతులలో మనకు మంచిని ఉపదేశించిన ఈ మహనీయుల సన్నిధిలో కృతజ్ఞతా పూర్వకంగా నమస్కృతులను సమర్పిస్తూ, వారు చేసిన ఉపకారాలను సదా గుర్తించుకుందాం. స్వస్తి.

★★★★★

# 20. ఒక సరసమైన వాదం

ఒక సరసమైన వాదం. ఈ వాదం ప్రహ్లాదుడు, హిరణ్యాకశిపుల మధ్య జరిగింది. హిరణ్యుడు తండ్రి, కుమారుడు హిరణ్యాకశిపుడు. తన కుమారుడైన ప్రహ్లాదుని చూచి "నీవు ఉన్నాడని చెప్పే నారాయణుడు ఇక్కడ ఉన్నాడా?" అని అడిగాడు , "ఇక్కడ ఉన్నాడా?" అని అడిగిన వెంటనే "అవును ఉన్నాడు, అంతటా ఉన్నాడు" అని ప్రహ్లాదుడు సమాధానం చెప్పాడు.

ఈ వాదాన్ని కొంచెం గమనించి చూద్దాం. "భగవంతుడు ఇక్కడ ఉన్నాడా?", అని హిరణ్యాకశిపుడు అడిగిన వెంటనే ప్రహ్లాదుడు వెంటనే తిరిగి ఏమని అడిగి ఉండవచ్చు. ",ఎక్కడా లేడు?–< అని నీవు ఏ విధంగా చెప్పగలవు? " అని తిరిగి వాదాన్ని చేసి ఉండవచ్చు .కానీ, ప్రహ్లాదుడు ఆ విధంగా చేయలేదు. ఇక్కడ ఉన్నాడా ? అని హిరణ్యాకశిపుడు అడిగినప్పుడు, " అవును, ఇక్కడ ఉన్నాడు" అని ప్రహ్లాదుడు సమాధానం చెప్పాడు. కానీ, వాస్తవానికి ఈ విధంగా అడగడానికి ఏమి సంబంధం ఉన్నది? ఔచిత్యం ఉన్నది? ఇక్కడ ఉన్నాడా? అని హిరణ్యాకశిపుడు అడిగాడు. దీనికి సమాధానంగా ప్రహ్లాదుడు ఏమి చెప్పి ఉండవచ్చు? "అవును, ఇక్కడ ఉన్నాడు ",అని మాత్రం చెప్పి ఉండవచ్చు. అంత మాత్రమే కాకుండా, ప్రహ్లాదుడు అంతటా ఉండడమే కాదు నాకు తెలిసిన ఇంకొక చోట కూడా ఉన్నాడు– అని ప్రహ్లాదుడు చెప్పి ఉంటే, హిరణ్యాకశికుడు ఏమని అని ఉంటాడు? నేను నీ మాటను నమ్మను. నేను చూపించే ఈ చోట ఉన్నాడా? అని హిరణ్యాకశిపుడు మొండివాదాన్ని చేసి ఉంటాడు. భగవంతుడు ఎక్కడో ఉన్నాడని అంటే ", నమ్మకుండా ఇక్కడ ఉన్నాడా.?" అని అడిగాడు కదా. ఈ విధంగానే, హిరణ్యాకశిపుని చూసి ప్రహ్లాదుడు ఈ విధంగా కూడా అడిగి ఉండవచ్చు. ఏమని అంటే, ", భగవంతుడు ఎక్కడ లేడు అని నీవు ఏ విధంగా చెప్పగలవు? అంతటా లేడు అనేది నీకు ఏ విధంగా తెలుసు? నేను "ఎక్కడో ఉన్నాడు ",అని చెప్పేటప్పుడు, అది ఆ విషయం, నాకు తెలియదు "–అని కదా హిరణ్యాకశిపుడు చెప్పి ఉండాలి. అప్పుడు భగవంతుడు ఎక్కడో ఉన్న విషయం నాకు తెలియదు– అని కదా అర్థం వస్తుంది. ఆ విధంగా అయితే, ",ఇక్కడ లేడు" అనే విషయాన్ని మాత్రం చెప్పవచ్చు. "అంతటా లేడు", అనే విషయం నీకు ఏ విధంగా తెలుసు ? అంతటా ఉన్నాడు, అంతటా లేడు అని ఈ రెండు సమానమే కదా. ఆ రెండు హిరణ్యాకశిపునకు తెలియదు. అయినప్పటికీ, "భగవంతుడు అంతటా ఉన్నాడు", అని ప్రహ్లాదుడు చెప్పినప్పుడు హిరణ్యాకశిపుడు "దానిని నేను అంగీకరించను. ఇక్కడ ఉన్నాడా

?" భగవంతుడు అని అడగవచ్చు. కానీ, హిరణ్యకశిపుడు పలికేటప్పుడు "భగవంతుడు ఎక్కడ లేడే!" అని అన్నాడు.

ఈ విధంగానే, లోకంలో ఇప్పుడు, ఎవరైనా, భగవంతుడు లేడు– అని వాదించేటప్పుడే , వారు తమ మాటకు తామే విరుద్ధంగా వాదిస్తున్నట్లు అవుతున్నది. వారు ఆ విధంగా అనేటప్పుడు "ఇక్కడ లేడు?" అని చెబుతున్నారా? ఎక్కడా లేరు– అని చెబుతున్నారా? మీకు "ఇక్కడ లేడు" అని తెలిసి ఉండవచ్చు. అంతటితో ఊరుకుంటే సరిపోతుంది, కానీ, "అంతటా లేడు" అనే సంగతి ఏ విధంగా మీకు తెలుసు? ఆ విషయం ఎవరికీ తెలియదు కదా. నేను ",భగవంతుడు ఎక్కడో ఒకచోట ఉన్నాడు. ఎక్కడా లేకుండా లేడు", అని అంటే, నీవు భగవంతుడనేవాడు ఎక్కడా లేడు!– అని అంటున్నావే. అది ఏ విధంగా చెప్పగలుగుతున్నావు? అంతటా లేడు –అనే సంగతి నీకు తెలియదు, నాకు తెలియదు– అని వాదిస్తారు.

అదే సమయంలో, " భగవంతుడు లేడు" అని చెప్పేది మాత్రం అంతటా లేడు" అని అంటే, తెలియని చోట కూడా లేడని ఏ విధంగా చెప్పగలం. లోకం చాలా విశాలమైనది కదా. దాన్ని అంతటినీ గూర్చి మనకు తెలుసునా? మనం ఆకాశంలో ఉండే గ్రహాల విషయం తెలుసుకోగలుగుతున్నామా? ఆ గ్రహాల లోపలకు అంతటికీ వెళ్లి, భగవంతుడు లేడు అని చూచి తెలుసుకోగలుగుతున్నామా? ఆవిధంగా మనం చూడగలిగినవారం కాదు కదా. మనకు తెలిసినది ఈ భూమండలంలో ఏదో కొంచెం చాలా అల్పమైన భాగం మాత్రమే. మనకు తెలుసు –అని గొప్పగా చెబితే, అది చాలా కొద్ది చోటుకు సంబంధించి ఉంటుంది. అన్నిచోట్లకు, అన్ని కాలాలలో వెళ్లి మనం తెలుసుకోలేము కదా. కానీ, వాదించేటప్పుడు మాత్రం "భగవంతుడు ఎక్కడా లేడు" అని చెబుతున్నాము కానీ ప్రతివాది "భగవంతుడు ఎక్కడో ఒక చోట ఉన్నాడు", అని చెప్పినప్పుడు, " ఆ విధంగా కాదు. భగవంతుడు ఇక్కడ ఉన్నాడా?" అని అడుగుతాము. ఇదే అసంబద్ధమైన మాట. అసంబద్ధమైన వాదం ఇది విన్నవారికిఏ కాదు, చెప్పే వారికి కూడా అర్థం కాదు ఈ విధంగానే ఇక్కడ తండ్రి కొడుకులు ఇద్దరూ వాదించుకున్నారు.

సరి, ఈ విధంగా చెప్పినట్లయితే, తన తండ్రికి తెలిసే అవకాశం లేదు అనే భావించి, " భగవంతుడు అంతటా ఉన్నాడు "అని ప్రహ్లాదుడు ఋజువుగా సమాధానం చెప్పగా, "ఆ భక్తుని మాటను నిరూపించాలి" అని నృసింహస్వామి అప్పుడే అక్కడే

ఆవిర్భవించాడు. మంచి సమయం! ఆ హిరణ్యకశిపుని కంటిముందే స్వామి ఆవిర్భవించినందున, ఇకపై వాదించే అవకాశం హిరణ్యకశిపునకు లేకపోయింది.

లోకంలో కూడా మనం గమనించవచ్చు .ఎక్కడో ఒకచోట దోపిడీ జరిగింది. ఆ దొంగతనం నిజంగా జరిగిందా? అని న్యాయస్థానంలో విచారణకు వస్తుంది. న్యాయాధికారులు విచారణ చేస్తారు. అప్పుడు "అదేమి? అక్కడ ఏమి జరిగింది?" అని అడిగితే, జరిగిన విషయాన్ని యథాతథంగా కంటి ముందు చూపించగలమా? ఎవరో ఇద్దరు, ముగ్గురు వచ్చి, ఆ జరిగిన సంఘటన నటించి చూపిస్తే చూపించవచ్చు గాని, అది వాస్తవమైన సంఘటన అవుతుందా? జరిగినది జరిగిపోయింది, మళ్ళీ దానిని యథాతథంగా చూపించటానికి వీలు కాదు కదా. "జరిగిన సంఘటన మళ్లీ నా ముందు సంభవించలేదు, కనుక, దానిని నిరూపించడం సాధ్యం కాదు" అని ఏ విధంగా చెప్పగలం? చెప్పడం న్యాయం అవుతుందా? దానికి తగిన సాక్ష్యాలు, నిరూపణలు మొదలైనవానిని పురస్కరించుకొని మాత్రమే దానిని నిరూపించడానికి సాధ్యం అవుతుంది. ఆ విధంగానే ," ఇక్కడ ఇప్పుడు, నా కంటి ముందు భగవంతుడు సాక్షాత్కరించలేదు కనుక అతడు ఎక్కడా లేడు" అని నాకు ఎంత మాత్రం. తెలియని పలు చోట్లను గూర్చి నేను ఏ విధంగా చెప్పగలను? చెప్పడం యుక్తమైనది అవుతుంది? సాక్ష్యాలతోనూ, మిగిలిన ప్రమాణాలతోనూ, దానిని ప్రత్యక్షంగా ఎవరైతే చూశారో, వారిని, పురస్కరించుకొని కదా ఏ విషయాన్ని అయినా నిరూపించాలి. ఆలోచించండి.



# 21. శ్రీరామనామమహిమ

శ్రీరామనామమహిమ అందరికీ తెలిసినదే. " రామః " అనే పదానికి కల మహిమ ఏమి? అంటే ,పోయే ప్రాణాన్ని కూడా తిరిగి బ్రతికించే శక్తిని మహిమను కలిగినది, ఈ రామ నామం. మృత సంజీవనం అని అంటారు, భట్టర్. రామనామాన్ని చెప్పగా చెప్పగా సంసారమే సమూలంగా లేకుండా పోతుంది. కర్మలు నశిస్తాయి. మళ్లీ ఈ లోకంలో జన్మించవలసిన ఆవశ్యకత అనేది ఉండదు.

"రామః" అంటే, "రామో రమయతాం శ్రేష్ఠః" –ఆనందాన్ని కలిగించేవారిలో చాలా గొప్పవాడు అని అర్థం. "రమయతీతి రామః" అనేది ఈ పదానికి కల వ్యుత్పత్తి. తనను దర్శించేవారిని తన దివ్య మంగళ విగ్రహ సౌందర్యంతోను, తన కళ్యాణ గుణాలతోనూ ఆనందాన్ని కలిగించేవాడు అని అర్థం. రామనామం తారక మంత్రం . ఈ లోకంలో జన్మించినవారికి అరుదైన మందై, ఈ జన్మ తరువాత మరుజన్మను లేకుండా చేసేదై, రామ నామం ప్రకాశిస్తున్నది. అందువల్లనే అది ఆనందాన్ని కలిగిస్తున్నది. ఈ లోకంలో శ్రీరాముని దర్శిస్తే, ఇప్పుడు ఈ జన్మలోనే ఆనందం కలుగుతుంది. ఇక మళ్లీ జన్మించవలసిన ఆవశ్యకత లేని నిత్యమైన ఆనందంకూడా కలుగుతుంది. అందువల్లనే రాముడు ఆనందాన్ని కలిగించేవారిలో గొప్పవాడు – అని చెప్పబడుతున్నది "రామ ఇతి అభిరామేణ వపుషా" అనికూడా శ్రీరామాయణంలో చెప్పబడింది.

వశిష్టుడు శ్రీరామునకు పేరు పెట్టాలని వచ్చినప్పుడు, తొట్టిలో పరుండి ఉండే శ్రీరాముని చూశాడు. చూచిన వెంటనే శ్రీరాముని అందమైన రూపం ఆ మహర్షి మనస్సును, చూపును ఎంతగానో ఆకర్షించిందట. ", నన్ను చూడగానే మీ మనసుకు ఎంతో ఆనందం కలిగింది కదా! ఆ విధంగా అయితే, నాకు రాముడనే పేరు పెట్టండి. "రామః" అంటే ఆనందాన్ని కలిగించేవాడు అని కదా అర్థం. అందువల్ల ఆ పేరును నాకు పెట్టండి" అనే అభిప్రాయాన్ని వశిష్ఠునకు శ్రీరాముడు చెప్పకుండానే సూచించాడట. అందువల్ల వశిష్ఠుడు రామునకు ఆ పేరును పెట్టాడు. ఇది రామశబ్దానికి కల మొదటి అర్థం.

ఇప్పుడు ఇంకొక అర్థాన్ని గమనిద్దాం. సంస్కృతంలో "రము క్రీడాయామ్" అనే ఒక ధాతువు ఉన్నది. ఈ ధాతువు నుండి కూడా రామ శబ్దం వ్యుత్పన్నం అవుతుంది. అప్పుడు రామశబ్దానికి "ఆనందించేవాడు, క్రీడించేవాడు" అని అర్థం. తనను ఆశ్రయించినవారికి, తనను ఆరాధించేవారికి ఆనందాన్ని కలిగించేవాడు అనేది మొదటి

అర్థం. తాను ఆనందించేవాడు అనేది రెండవ అర్థం. ఇతరులకు ఆనందం కలిగించాలి అంటే, మనం ఆనందం కలిగినవారమై ఉండాలి, ఆనందించేవారమై ఉండాలి కదా. నేను దుఃఖంలో ఉండేవాడను అయితే, ఇతరులకు ఏ విధంగా ఆనందాన్ని కలిగించగలను? అందువల్ల బ్రహ్మం యొక్క గొప్పతనాన్ని గూర్చి చెప్పేటప్పుడు "ఆనందం బ్రహ్మణో విద్వాన్ " అని ఆనందస్వరూపునిగా, ఆనందమయునిగా వేదాంతాలు పలికాయి. ఆనందమే స్వరూపంగా కలిగినవాడు భగవంతుడు –అని అన్నాయి. అందువల్లనే ఆ భగవంతుడు "ఏష హ్యేవానందయాతి" అని అంటూ తనను ఆశ్రయించిన భక్తులకు ఆనందాన్ని కలిగించేవాడు అని చెప్పాయి.. భగవంతుడు దుఃఖంలో మునిగి ఉండేవాడైతే, ఆ భగవంతుని వల్ల మనం ఏ విధంగా ఆనందాన్ని పొందగలం? ఇతరులను ఆనందింప చేసేవాడు ముందుగా తాను ఆనందాన్ని కలిగినవాడై ,అనుభవించగలిగినవాడై ఉండాలి. ఆనందమయునిగా ఉండాలి. ఆ విధంగా ఆనందమయుడై ఉండేవాడు శ్రీరాముడు. ఇతరులకు ఆనందాన్ని కలిగించేవాడు శ్రీరాముడు. అందువల్ల రామనామానికి గల రెండవ అర్థం తాను క్రీడించేవాడు, ఆనందించేవాడు– అని.

"నీకు పట్టాభిషేకం చేస్తాను" అని చెప్పినప్పుడు, ఆ తరువాత "నీకు రాజ్యం లేదు, నీవు వనానికి వెళ్ళు" అని చెప్పినప్పుడు, ఈ రెండు సందర్భాలనూ, శ్రీరాముడు సమంగా స్వీకరించినవాడు. " తే వనేన వనం గత్వా రమమాణా వనే త్రయః ",అని మహర్షి కూడా ఈ విషయాన్ని తెలియజేశాడు. వనంలో ఉన్నప్పుడు భవనంలో ఉన్న దానికంటే ఎక్కువ ఆనందించినవాడు, శ్రీరాముడు. మనం ఎక్కడ ఉన్నా, ఆ చోటు ఎటువంటిది అయినా, అక్కడ ఆనందించగలిగినవారమై ఉండాలి. నేను ఒక చోట అలవాటు పడ్డాను, అక్కడ మాత్రమే ఆనందాన్ని పొందగలను వేరొక చోట ఆనందించలేను– అనే విధంగా ఉండకూడదు. మనకు ఇష్టమైన చోట ఆనందం కలుగుతుంది, నిజమే. కానీ, మనం ఏ చోట ఉన్నప్పటికీ కూడా, అక్కడ ఆనందించగలిగిన స్వభావాన్ని కలిగినవారమై ఉండాలి. ఎల్లప్పుడూ ,ఎక్కడ ఉన్నా ,ఆనందించగలిగినవారమై ఉండాలి. అటువంటి స్వభావాన్ని కలిగినవాడు శ్రీరాముడు. శ్రీరాముడు అయోధ్యలో ఉన్నప్పుడు ఆనందించాడు, అరణ్యంలోకి వెళ్లినప్పుడు కూడా ఆనందించాడు. అరణ్యంలో శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు అనే ముగ్గురు మాత్రమే ఉన్నారు. ఒకవైపు, భరతుడు తనతో కలిసి లేడే! అనే కొరత ఉన్నప్పటికీ కూడా, ఇంకొక వైపు అరణ్యంలో ఉండే మునుల దర్శనాన్ని పొందగలం, వారితో కలసి జీవించగలం, కందమూలాలను భుజించి తపస్సు చేసుకుంటూ ప్రశాంతంగా

సమయాన్ని గడపగలం, ఇటువంటి గొప్ప అవకాశం మనకు లభించిందికదా –అని శ్రీరాముడు ఆనందించాడు." వనవాసో మహోదయః" అని అన్నాడు.

ఈ విధంగా రామనామానికి రెండు అర్థాలు –తాను క్రీడిస్తూ ఆనందించేవాడు, తనను ఆశ్రయించినవారికి ఆనందాన్ని కలిగించేవాడు– అని. ఈ లోకంలో ఆనందంగా ఉండాలనే ఆశ ఎవరికి ఉండదు కనుక! అందువల్లనే రామనామం మూలమంత్రమై తారక మంత్రమైనది. ఎల్లప్పుడూ ఈ సంసారంనుండి మనకు విముక్తిని కలిగించే మంత్రమై ప్రకాశిస్తున్నది. భారతీయులకు జీవనాడిగా ప్రకాశిస్తున్నది.

★★★★★